# LIFE & WRITINGS OF

P. J. Reddy B. Sc.

(BRISTOL.)



శ్రీ॥ శే॥ పింగిలి జనార్దనరెడ్డి

బి. యస్ సి. గారి

జీవితచరిత్రము—రచనలు

---



1931.

పబ్లిషర్
పింగిలి వేంకట రామారెడ్డి
దేశముఖు.

# LIFE & WRITINGS OF

P. J. Reddy B. Sc.

(BRISTOL.)

# కీ॥ శే॥ పింగిలి జనార్దన రెడ్డి

బి· యస్ సి· గారి

జీవితచరిత్రము—రచనలు

---

1931.



SRI PINGLE JANARDAN REDDY

B. Sc. (BRISTOL)

BORN CHEGOMMA
5-9-1903

DIED BERLIN
31-1-1929





# ఉపోద్ఘాతము

శ్రీ॥ శే॥ పింగిలి జనార్దనరెడ్డిగారు విజయ నగరరాజుల సేనానాయకుల వంశమందుద్భవించినవారు. మహారాజాధిరాజగు రామదేవరాయలు క్రీ॥ శ॥ ౧౫౬౮ సంవత్సరమున ఓడింపబడగా—ముగ్గురు అన్నదమ్ములు తమ జీవనార్థమై బయలుదేరిరి. మార్గమధ్యమందు నిజాము రాష్ట్రములోని కరీమునగరు జిల్లాలో పరకాల తాలూకాలోని మల్లారెడ్డిపల్లెయను గ్రామసమీపమున నొకచెట్టు క్రింద నిద్రించిరి. అందొకరు తాముతత్క్షణమే బయలుదేరినట్లైన తమకొక సంస్థానముగాని రాజ్యముగాని లభించునని కలగాంచిరి. చుట్టుపట్టులనుండు దేశము దక్కను రాష్ట్రమునకు కప్పముచెల్లించునట్టి క్రూరాత్ముడని విఖ్యాతుడైన చంద్రగిరిరాజుచే పరిపాలింపబడుచుండెను. ఇతడు తనయేలికపై యుద్ధముచేయుటకు సైన్యము సిద్ధముచేసి యుండెను. తన దుష్పరిపాలనకై ప్రజలకు అతనిపై ప్రీతిలేకుండెను.

ప్రాతఃకాలముననే యీముగ్గు రన్నదమ్ములు మల్లారెడ్డిపల్లె సమీపమందలి చంద్రగిరికొండపై నేటికిని శిథిలావస్థలోనుండునట్టి యొకకోటను వశపరచుకొని చంద్రగిరి రాజునోడించి చ.పి దక్కను చక్రవర్తియొక్క న్యాయమునకు తాము ఆస్థలమునకు అధికారులమైతిమనియు పూర్వమువలెనే తామును పైకముచెల్లించుచుందుమనియు వర్తమాన మంపిరి.

ఇంతలో విజయనగర ధనికు డొకడు తన యాత్రాసమూహముతో పారివచ్చి యామార్గమున పోవువాడై విజయనగరవు వారును తన బంధువులును కొందరు ఖైదీలుగా నుంచబడిరనివిని నాయబుతో తాను కప్పమునంతయు చెల్లింతుననియు తన కాసంస్థానమీయ వలసిన దనియు చెప్పెను. ఇంతలో నీముగ్గురిలోనొకరు తప్పించికొని పోయిరి. మిగత యిద్దరు క్రొత్తవాని సామంతులుగా నుండుట కంగీకరించి విముక్తులైరి.

కొంతకాలమునకు మూడవ తమ్ముడు మరలవచ్చి తనభాగమునిమ్మని కోరగా నీతనికి సంస్థానములో మూడవభాగమిచ్చిరి. అతనినుండి పింగిలి వంశమేర్పడినది. మొదలువీరు విజయనగర రాజు సైన్యములో సైన్యాధికారులై తత్పాత కుతుబుషాహీ, ఆసఫ్ జాః పరిపాలకులకు వశవర్తులై రాజభక్తితోగూడిన ప్రశంసనీయ మగు సేవలచేసినవారు.

హైద్రాబాదులో నందరకును బాగుగా పరిచితులగు పింగిలి వేంకటరామారెడ్డి గారికి కీర్తిశేషులు జ్యేష్ఠపుత్రులు, వీరి విషయమై నేను విశేషముగా చెప్ప నవసరములేదు. వీరి విద్యాప్రియత్వము వీరు తమ కుమారులకును బంధువులకును నుత్తమ శిక్షనిచ్చుటచేతను తమ సంఘముయొక్క విద్యావ్యాపకమునకై రెడ్డి హాస్టలును, గ్రంథాలయమును స్థాపించి దానికి ధన సహాయము చేసి దానికి కార్యనిర్వాహక సభ్యులై యుండుటయే చాటుచున్నది. వీరు తమ సంఘముయొక్క సంస్కార కర్తలలో నగ్రగణ్యుడు, క్రీ, శ. ౧౯౧౧ లో పూర్వాచారులు ప్రతిఘటించినను తమతమ్ము లగు కృష్ణారెడ్డిగారిని నితరులగు సిద్ధరు రెడ్లతో బాటిగా ఇంగ్లాం

దున కంపిరి. అటుతర్వాత అనేకులు బయలుదేరిరి. ౫ ఆగష్టు ౧౯౨౨ లో వీరికుమారులగు శ్రీ॥ శే॥ జనార్దనరెడ్డిగారు ఇంజనీయరింగు కొరకును, ఆర్. జి. రెడ్డిగారు బారిస్టరు విద్యకొరకును, టి. యస్ రెడ్డిగారు సైన్సుకొరకును ఇంగ్లాండునకు వెళ్లిరి. ఆసమయమున కీర్తిశేషుల అవ్వగారు మరణించుచుండిరి, వారి తల్లిగారును చాల యస్వస్థతగా నుండిరి, కాని వారి తండ్రిగారు ఆక్షేపణముల నన్నింటిని లెక్కింపక సంతోషముతో తమ కుమారుని నింగ్లాండునకు పంపిరి.

స్వర్గవాసియగు (జనార్దన రెడ్డిగారు) నాకు స్వయముగా పరిచితులు కాకున్నను నతడు హైద్రాబాదులో విద్యార్థిగా నుండినప్పుడు అతని కార్యముల నన్నింటిని చూచుటకును, నతడు యూరోపులోనుండినప్పుడు ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా యతని విషయములను తెలిసికొనుటకును నా కవకాశము దొరికియుండెను. నిరుపమానమగు శక్తిసామర్థ్యముల నాయువకుడు కలిగియుండెను. అతని గ్రంథాలయములో నుత్తమమైనట్టి గ్రంథములును సైంటిఫిక్ అమెరిక్ పత్రికతోసహా మంచి పత్రికలు నుండెను. పాకశాస్త్రము మొదలుకొని చాలక్లిష్ట సమస్యలతో కూడిన శాస్త్రములవరకును నించుమించు ముఖ్యవిషయము లన్నింటిలో నాతడు శ్రద్ధగలవాడగుటచే నతని విజ్ఞానము విశాలముగను వివిధవస్తు పరిజ్ఞానయుక్తముగను నుండెను. ఎలెక్ట్రిసిటీవిషయములో నతడు పరిజ్ఞానముకలవాడుగ నుండెను. తన బంగ్లాలోని ఎలెక్ట్రిక్ జోడింపులనంతయు నతడే యేర్పాటు చేయుటయేకాక ఎలెక్ట్రిక్ సిగ్నలుకూడ నిర్మించియుండెను. తన యింటికిని తన స్నేహితునిదగు నొక పొరుగింటికిని నొక వైర్లెసుతంతీకూడ

పెట్టియుండెను. ఒక ప్రాచీన మర్యాదలు కలకుటుంబమందు బెరిగి నను నతడు జాతిభేదములు పాటింపనివాడు. అందఱిని తమ తమ యర్హతలను బట్టి సమానముగా జూడగోరుచుండెను. న్యాయబుద్ధి యతనిలో ఘనముగానుండెను. అతనికి సంఘసంస్కార విషయమై చాల దూరదృష్టితో గూడిన యభిప్రాయములుండెను. స్త్రీలసము ద్ధరణమున చాల యభిలాషయుండెను.

యూరోపులో విద్యార్థిగానుండిన కాలమున తన విద్యాభ్యా సమున పరిపూర్ణశ్రద్ధ వహించుటయేకాక తాను స్వదేశమునకు దిరిగివచ్చిన తర్వాత నేమిచేయ వలయునో యంతయు నాలోచిం చుచుండెడివాడు. ప్రజలు వ్యవసాయముపై విధిలేక యాధారప డుచుండు విషయ మతనికి తృప్తికరముగ లేకుండెను. అందుచే పరి శ్రమలను వృద్ధిచేయ గోరుచుండెను. పరిశ్రమల విషయమై హిం దూస్థానములో ప్రకటింపబడిన గ్రంథములను దెప్పించికొని సవి మర్శముగా చదివి తాను ముఖ్యముగా నూనెగింజనుండి నూనెతీ యుట, నిజాము రాష్ట్రములో సమృద్ధిగా పంటలు పండించుట, ఎముకలను పిండిగొట్టుట, ఇండ్లలో నుపయోగపడు కుర్చీలు మున్న గు సామానులు చేయుట—ఇట్టి విషయములందు శ్రద్ధ కలిగి యుం డెను. ఇండియాయొక్క రాజకీయాభివృద్ధిని నతడు గమనించుచుం డెను. తర్వాతి కాలములో ".హిందూస్థానము హైందవులకొఱకే" యను సిద్ధాంతమందు గట్టినమ్మకము కలవాడయ్యెను.

సహజముగా, నతని జనకులు నతడు రాజకీయ విషయములందే మి జోక్యము కలిగించుకొనునో యని భయపడెడివారు "రాజకీయ ములనిన తిరుగుబాటు కానేరదు" అని యతడు వారితో నిర్భయ ముగా జెప్పుచుండెడివాడు, అతడు సంభాషణమందు బీతి కల

వాడు. కనిష్ఠము మూడేండ్లక్రిందటనే నేటికాలమున నిండియా యేస్థితియందుండెనో సరిగా భావి సూచన చేసియుండెను. ఈ సందర్భమున నేను ఉ న్యాసరంగపు రాజకీయములకు ప్రతికూలు డననియు, మితవాదులలో మితవాదిననియు, నివేదించుచున్నా ను. కాని నేటి యువకులు నిరంకుశపద్ధతినినిరసించి ఇండియానుమంచి స్థితికి దెచ్చుటకై నిజమగుసానుభూతిని సత్యవాంఛను జూపింపగోరు చున్నారు. ఇదివరలో నిండియాలోనుండినసానుభూతిగల యూరోపి యన్ ప్రొఫెసర్లును, అధికారులును నిప్పుడు లేరని వినుచున్నాను. అట్టివారి విషయమై నాకు చాల యభిమాన ముండెడిది. వారికి బదులుగా నిప్పుడు హైందవులను గౌరవింపవలసిన రీతిగా గౌరవిం ప నొల్లని యూరోపియనులు బహుళమై యున్నారు. విద్యాభ్యా స నిమిత్తమై యింగ్లాండునకు బోవు విద్యార్థులు నీచముగా జూడ బడుచుండుటచేతను వారు స్వదేశమునకు పోయిన తర్వాత నాం గ్లో యిండియనులను నధికారులను సంపూర్ణమగు నసహ్యముతో జూతురు. ఇప్పుడు "మర్యాద నిచ్చి మర్యాదగొను" పద్ధతి లేదు.

ఇట్టి సందర్భములలో నితడు అప్పుడప్పుడు కఠినముగా "ఇం డియా ఇండియావారి కుండవలెను" అను సూత్రమును ప్రోద్బలము ను చేయుటలో నేమియు నాశ్చర్యము లేదు. కాని ఇతనికి ఇంగ్లీ షువారియెడ అయిష్టమును, జర్మనువారియెడ ప్రత్యేకాభిమానము ను లేకుండెను. ఏలన నీరెండు జాతులును తమతమ మేలుకొఱకే ఇండియాపై ప్రీతి చూపెడివారు.

తనతండ్రివలెనే యతని మనస్సు చాల దృఢమైనది. తాను అభిలషించిన దంతయు సంపాదించి తన దేశమునకు తిరిగివచ్చి జర్మ

నీదేశమందంతటను శ్రేష్ఠమగు ఇంజనీయరింగు కంపెనీయొక్క ఛీఫ్ ఇంజనీయరుగా నేర్పాటగు సమయములో నతడు చనిపోయెను. అతడు కోరినదంతయు సంపాదించుకొనెనని మరల చెప్పదగిన మాట. కానదైవ విధియె నీవిషయమును తీర్పుచేయునది కాన నతని జననీ జనకుల యభీష్టము నెరవేరకపోయెను, నిజమగు సానుభూతి చూపించుచు నతడీ కాలమునకును, నిప్పటివారికన్నను చాల ముందంజ వేసినవాడని చెప్పవలసినదే. అతనియొక్క యొకటి రెండు యుపన్యాసము లిందు ప్రకటింపబడినవి.

యం. బి. సుబ్బారావు,
రెసిడెన్సీ హైద్రాబాదు.



# జనార్దన రెడ్డిగారి జీవిత చరిత్రము



జీవిత చరిత్ర వ్రాయునాచారము ఎట్లువచ్చినది, ఎప్పటి నుండి వచ్చినది అను విషయమును పరిశోధించుట 'యించుమించు కష్టసాధ్యమైనపని. మన చరిత్ర యొక్కయు మన పూర్వుల నాగరికత యొక్కయు మూలాధారము జీవిత చరిత్రలే. అట్టి జీవిత చరిత్రలీ క్రింది చూపింప బడిన వివిధ విషయముల యొక్కయు ముఖ్యకారణముల యొక్కయు నాధారములపై నేర్పడినవి. మొదటిది గతించిన వారు జీవిత చరిత్రచే చిరస్మరణీయులై యుండుట. ఇంతకన్న ముఖ్యకారణ మేమన యువకులు తమ పూర్వులెందరో లేక యంతకు పూర్వమో యీలోకమును బాసిపోవగా నట్టివారి క్రమక్రమాభి వృద్ధిని గమనించుటకు భావివర్తమాన సంతతి వారికి దీని మూలమున నొక యవకాశము కలుగు చున్నది. మూడవది జీవిత చరిత్రలు పెద్దలు చెప్పిన ‟యాన్యస్మాకంసుచరితాని తాని సేవితానినోఇతరాణి” (మాలోనుండు మంచినే గ్రహించ వలెను. తప్పులనుగ్రహించరాదు) అను న్యాయము ననుసరించుట కుపకరించును.

సాధారణముగ జీవిత చరిత్రముల వ్రాయు బాధ్యత మృతులగు వారి దగ్గరి బంధువులపైనను లేక మృతుని జీవితములను గురించిన సరియగు విషయముల నెరుగు వారిపైనను ఉంచును. ఈ కారణముచే ఈ బాధ్యత అనర్హుడనైన నాపై మోపబడి యుండుటచే నేను యీ కార్యమునకు బూనుకొను చున్నాను.

నా ప్రియకౌమారుడగు వేంకట జనార్దనరెడ్డి చరిత్రము నతని దురదృష్టపు తండ్రినైన నేను వ్రాయబూను చున్నాను. జనకులకును వారి సంతతికిని పరస్పర సంబంధ మెట్టిదిగా నుండునో యా విషయమై నేను వెల్లడింప నక్కరలేదు. తల్లిదండ్రులు తమ వార్ధక్యదశయందుండగా తమ కౌమారుడు తరుణ వయస్సునందు మృత్యువు వాతబడిన వారికి కలుగు వ్యసనమును గురించియు కష్ట స్థితిని గురించియు పూర్వపు కవులును గ్రంథ కర్తలును గద్య పద్యాత్మకముగా గానముచేసి యున్నారు. ఎల్లరకు తెలిసిన విషయమును గురించి వ్రాయుట చర్విత చర్వణముగా నుండును.

ఈ జీవిత సంగ్రహమును వ్రాయుటలో జనుల యాలోచనా శక్తి కుపకరించుటయే నా ముఖ్యోద్దేశమై యున్నది. ఈ ప్రయత్నము వలన ఏమైన మంచి ఫలితములు గలిగిన నా సర్వస్వమును నేను కోలుపోయిన వాడనైనను విశేష భాగమును పొందిన వాడనని తలంచెదను. ఇక ప్రకృతమునకు.—

నా యభిలాష

నాకు సంతతిని పరమాత్ముడు ప్రసాదించి నట్టయిన వారిలో భగవద్భక్తి, భూతదయ, న్యాయధర్మ సత్యపరత్వము, ఆత్మగౌరవము, పరుల స్థితిగతులకు తగినట్లు వారి యెడగౌరవము చూపుట, అనుగుణముల దేవుడు వారికి ప్రసాదించు గాతయని భగవంతుని ఎల్లప్పుడు ప్రార్థించు చున్నాడను. నా కోరిక లన్నియు ప్రసాదింప బడిన రీతిగనే పరమేశ్వరుడు ఈ కోరిక సహితమును నెరవేర్చి యుండెను. నాదురదృష్టము చేతనే మేము మా హృదయ సంతుష్టి కలుగునట్లుగా ఆపుష్పవికాసమును చూచుటకు పూర్వమే

వసంతఋతువు గడచిపోయెను. తరువాత వయస్సులో అనేక మమ్ముల బాసిపోయి నిరంతర దుఃఖమును మమ్ముల ముంచిపోయెను. ఒకకవి చెప్పిన యీ క్రింది వాక్యము కడుంగడు సత్యము.

"పుష్పములు రెండుదినములైనను వికసించెను. కాని పాపము మొగ్గలుమాత్రము వికసింపక పూర్వమే వాడిపోవుట ఎంతయు సంతాపకరము." నేను "మానవునికి దైవ సంకల్పములో జోక్యము కలిగించుకొనుటకు శక్తిలేద"ను న్యాయమును అనుసరించి ఈమాతృత్వమునందు గుణపాఠమును గ్రహించితిని.

## జననము

పింగిలి వేంకట జనార్దనరెడ్డి శోభకృతునామ సంవత్సర భాద్రపదశుద్ధ ౧౪ కి సరియగు ౨౯ మొహర్ ౧౩౧౩ ఫసలీ కి సరియగు ౫-౯-౧౯౦౩ తారీఖున మధ్యాహ్నము ౧ గంట కాలమునకు తనతల్లి పుట్టినింటిలో వరంగల్లు జిల్లాయందలి కంభం తాలూకాలో చేగొమ్మ గ్రామములో జననమొందెను. ఆదివసము హిందువులకందరికి ప్రధానమగు అనంత చతుర్దశి యుత్సవము. జ్యోతిష్యుడు ఆతనిజాతకమును పరీక్షించి బాలుడు ధైర్య, కీర్తి, విద్య, పరోపకార గుణములు కలుగువాడని నొక్కిచెప్పెను.

అతనిజననముల ఉభయవంశము వారికిని అత్యంత ముదావహమై యుండెను. జన్మనక్షత్రమును బట్టి బాలునికి వేంకట జనార్దనరెడ్డి అని పేరు పెట్టబడెను. బాలుని జనకవంశమందు అతని బాల్యమందు అతని అవ్వ చాల అత్యంతముగ ప్రేమతోడను శ్రద్ధతోడను పెంచుచూవచ్చెను. ఈ బాలుడు తన జనకుని కుటుంబ

మం డేగాక పురుషసంతతి లేనట్టి మాతృబంధువుల వంశమందున అత్యంత ప్రీతితో పెంచబడెను. బాలుని జననియొక్క తలిదండ్రులు తమ సమీపమందు బాలుడు లేనికాలములో తహతహ పడు చుండిరి. యిదేప్రకారము బాలుని తండ్రియొక్క జననియు ఇతర బంధువులును విచారపడు చుండెడివారు.

## అస్వస్థత

శిశువునకు పదినెలల వయస్సప్పుడు అతనియొక్క తాత అవ్వలు అతని ఒక మొక్కును తీర్చుటకై గార్ల జాగీరునకు పోవ నిశ్చయించిరి. శిశువగుటచే అతని దీసికొని పోవుటకు నేనొప్పుకొననైతిని. అయితే వారి భక్తి ముందట నామాటలు సాగవయ్యెను. కనుక ఒకదివసమున అందరు చెవుగొమ్మనుండి గార్లకు బండిలో ప్రయాణమైరి. త్రోవలో గొల్లగూడెము అను గ్రామములో కొన్ని గంటలు విశ్రాంతి గైకొని సాయంత్రమునకు గార్ల చేరి అచట ఒక పూజారి ఇంట బసచేసిరి. ఆరాత్రి బాగుగ సంతోషముగనే గడిపిరి, గాని ఉదయము నాలుగు గంటలకు పిల్లవానికి వ్యాధి కనపించుటచే అందరు చింతాక్రాంతులైరి. శిశువుయొక్క దేహామంతయు నల్లనై స్మృతితప్పిపోయెను. గ్రామ వైద్య ప్రకారము బొడ్డునకును తలకును నొసటికిని రక్షలువేసిరి ఇందుచే శిశువునకుస్మృతివచ్చెను కాని తరువాత యిరువదినాలుగు గంటలలో ఆవ్యాధి అతనికి నాలుగుపర్యాయములు కనుపించకొనెను అట్లు కనుపించుకొనినవుడెల్లను అందరు నిరాశాహతులగుచుండిరి తరువాతి కాలములో అప్పుడప్పుడు బాలునికి వివిధములగు జబ్బులుకనిపించుచుండెను కాని అవి ఏవియు విశేషభాదకరములు కాకుండెను బాల్యదశయందుగాక యవ్వనదశయందు మృత్యుసంభవము దైవముచే నిర్దేశింప బడి యుండెను.

## బాల్యదశలో దేశాటనాభిలాష

బాలుడు ౧ సంవత్సరము 3 మాసముల వాడగు నప్పటికి ఈరీతి మార్పుజెందెను అతనికి ప్రయాణమందు చాల ఇచ్ఛకలిగి నటులకనిపించెను, చిన్న తనములో పిల్లలు తమతల్లుల విడచి ఉండు టకొప్పకుండుట సహజము; కాని యీబాలునికి ఆమమతలేక అవ్వ తోగాని లేక జేజతోగాని యక్కడికైనను పోవుటకు బాగుగ నొప్పుకొను చుండెను.

## ఒకటిన్నర సంవత్సరముల వయస్సుననే చతురతను ఆత్మగౌరవమును ప్రదర్శించుట.

అతడు ఒకటిన్నర సంవత్సరముల వయస్సువాడుగా నుండగనే తనచాక చక్యమును జూపించెడివాడు తన కేమైన కావలసియుండిన నెవరిచేతినైన బట్టుకొని దాని దగ్గరకు తీసుకొని పోవువాడు ఇంకె వ్వరైన దానినె యతనిచేతికిచ్చిన దానిని తీసికొననొల్లడు ఇట్టి యాత్మగౌరవము తుదవర కతనియందుండెను

## అతని మాతామహుని మరణము—అతని జీవితపద్ధతి

ఈ బాలుడు ౧ సంవత్సరము ౬ నెలలు ౨౪ దివసముల యీడుగలిగి నప్పుడు వానిమాతామహుడు (అనగా నామామ) అగు ఇనిగాల వేంకటనరుసయ్యగారు ఖమ్మములో తన 3౮ వ యేట విశ్వావసు నామ సంవత్సరము నందు ౧౦ ఖుర్దాదు ౧3.౧౪ ఫసిలికి సరియగు ౧౪ ఏప్రెల్ ౧౯౦౫ వ సంవత్సరము నాడు ప్రొద్దున ౮ గంటలకు మృతించిరి. వీరు మంచి పైల్వానులు బిన్నోటు విద్యయందు ప్రవీణులు వీరుస్వారి చేయుటలో కూడ ప్రవీణులు.

వీరి ధైర్యముకూడ ప్రశంసనీయము వీరు పెద్దపులి వేటను నితరయడవి మృగముల వేటను నడచియే వేటాడువారు ఒక సమయమున వీరొక్కరే యొక (డాకూల) దొంగల గుంపును వెన్నంటి పట్టుకొని పోలీసువారి కప్పగించి యుండిరి ఒకతూరి వీరు రైలు బండితో పందెము వేసి చింతకానినుండి ఖమ్మము వరకు స్వారిచేసి పందెము గెలచిరి. ఇట్టి సాహసకార్యములలో నొకదానిలోనే వీరు మరణించిరి కంటాయపాలెములో నొకయెద్దు విడివడి జనులపైబడి హింసించుచుండెను వీరాయెద్దును నొక్కరే కొమ్ములతోబట్టి దానినొకత్రాడుచే కట్టివైచిరి రాత్రి ౯౪ గంటలకాలమందీ ఇనిగాల వెంకటనర్సయ్యగారు తమయింటినుండి యింకొకరి యింటికి పోవుచుండ నీయెద్దు తక్షణమే వీరిపైబడెను వీరు దానినొక కఱ్ఱతో కొట్టిరి కాని కఱ్ఱవిరిగిపోయెను ఎద్దు మరల వీరిపై దుముకగా వీరు దానిని తనపిడికిలితో వారించిరికాని చేయివిరిగెను. ఇంతలో చుట్టుపట్టులవారు గుమికూడి యెద్దును పట్టుకొని వీరిచేతికి కట్టుగట్టిరి. కాని బాధయత్యంతమై (Tetanus) వ్యాధికనుపించెను. వైద్యులు తమశక్తికొలది ప్రయత్నించిరి కాని వీరు మృతించిరి.

జనార్దనరెడ్డికి ఇంజనీయరింగుపై అభిలాష

బాలుడు రెండు, రెండున్నర యేండ్లవయస్సువాడై నప్పుడు వానికి ఇంజనీయరింగుపై అభిలాషయుండు సూచనలు చూపించెను. మేములేనప్పుడు గ్రామఫోనుతో జోక్యము కలిగించుకొని దానిని తెఱచుటకు ప్రయత్నించెడివాడు. ఇట్లుచేయుచుండ మేమువానిని మందలించినను వినెడివాడుకాదు. దానివలన నపాయముకలుగునని భయపెట్టినను పశ్చాత్తాపమునొందక తనకు సందుదొరికినప్పుడెల్లను నాపనినే చేయబూను చుండెను. ఇదేప్రకారము సోడామెషిను

తోను బైసిక్కిళ్లతోడను చేయుచుండెడివాడు. కొన్ని సమయములలో సోడాబుడ్లు పగులుచుండెడివి కాని యదృష్టవశాత్తు దెబ్బలు తగులక తప్పించుకొనుచుండెడివాడు. అట్లు సంభవించినను వాడు తన యలవాటును మానడు. తుదకు మేమువాని యిష్టాచేష్టలలో జోక్యము కలిగించుకొనుట మానుకొంటిమి. మానుకొనుట యేకాక యట్టి యభిలాషలలో సహాయముచేయ మొదలిడితిమి. ఇట్లుమేము వానికి మెర్కిన్ పెట్టెలనిచ్చి పుస్తకములలో చూపించిన ప్రకారము క్రేన్ (Crane) వంటి నమూనాలను తయారుచేయుటకు సాయపడుచుంటిమి. అతడెప్పుడైన నమూనాల ప్రకారము చేయజాలక పోయిన చింతాక్రాంతుడగుటకు మారుగా నింకను ప్రయత్నముచేసి జయముపొందుచుండెను. అట్లుచేసిన తర్వాత తన విజయమునకై సంతోషము చూపించుచు మాచే మెప్పుబడయుచుండెను.

బాలునికి నాలుగేండ్లు పడిన తర్వాత కృష్ణారెడ్డిగారు వానికి కొన్ని యంకెలను నేర్పించి చిన్నచిన్న రాళ్లగుళికలు తెచ్చి వాని సహాయముచే లెక్కలను నేర్పి గణిత శాస్త్రమందు మంచి తెలివి కలుగునట్లు చేసెను. అందుచే బాలుడుతన జీవితములో లెక్కలలో నెన్నడు తప్పినవాడుకాడు. ప్రతి పరీక్షలో లెక్కలలో నుత్తీర్ణుడయ్యెడివాడు. ఈశాస్త్రమందు బాలుడు తనసహాధ్యాయులందరిలో మిన్నయనిపించికొనెను.

మా యనుభవమున నిట్టి విద్యాపద్ధతి చాల యుపయోగకారి యని తోచినది. ఇది యితరులకును మార్గదర్శక మగుట కర్హమైనది అటు తర్వాత బాలునికి తెనుగు యక్షరములను ఎక్కములను నేర్పితిమి.

బాలుని మైదవయేట నొక యుపాధ్యాయుని నేర్పాటు చేసితిమి. పూర్వకాలపు విద్యాపద్ధతిలో ౨౪ గంటలలో ౧౮ గంటలు విద్యార్థి పంతుల వశముననే యుండును. అట్టి ప్రాతకాలము పల్లెటూరి బడిపద్ధతిపై వీనిని చదివించలేదు. ఉపాధ్యాయుడు బాలునికి ప్రొద్దుననొక గంట సాయంత్రమొక గంట— అదియు విలాసార్థముగా నుండునట్లు— చదువుచెప్పెను. బాలుని కఠినముగా జూడకుండెను. క్రమక్రమముగా బోధనాకాలము హెచ్చించి తుదకు దినము ౫ గంటల కాలము విద్యచెప్పించితిమి. బాలుడు తెనుగులో చిన్న చిన్న వాక్యములు చదువను వ్రాయను నేర్చుకొనశక్తుడైన తర్వాత ఇంగీషు విద్య ప్రారంభించితిమి.

## సుగుణములు

బాలుడు సమర్థుడగుటయేకాక మేధావిగను, సత్యప్రియుడుగను, ఆత్మగౌరవము కలవాడుగను నుండెను. ఈ కారణములచే వీని పినతండ్రులగు కృష్ణారెడ్డిగారును రంగారెడ్డిగారును కుటుంబము లోని యితరులును నితనిని ప్రేమించు చుండిరి. ఇట్టి ప్రేమకింకెవ్వరు పాత్రులు కాకయుండిరి. ఈ కారణముచే నాబాలుడు వీరినందఱిని గౌరవించు చుండెను. అతడు నిరంతరము సత్యవాదిగా నుండెను. కాని యీగుణము కొన్ని సమయములలో నసందర్భముగ నుండుటచే మనస్తాపములకు కారణమగుచుండెను. కాని సత్యమే యెల్లప్పుడును జయము పొందునది కాన మేమొప్పుకొన వలసివచ్చినను నతడు గర్వియగునను భీతిచే మేము మాయంగీకారమును ప్రదర్శింపకుంటిమి.

అతని తర్వాత ముగ్గురు శిశువులు జనించినను నతడేయందఱకును ప్రియుడైయుండెను అతని న్యాయమైన కోరిక లన్నియు నెరవేర్ప

బడుచుండెను. తల్లిదండ్రులగు మావిషయము లటుండ అతని పినతండ్రులగు కృష్ణారెడ్డి గారును రంగారెడ్డి గారును మాకన్న విశేషముగా ప్రేమించెడివారు. అతని బాల్యమునుండి యతనిని తండ్రులవలెనే గాక సోదరునివలె ప్రేమించుచుండిరి. అతని కోరిక నెప్పుడైన నేను నెరవేర్పకుండిన రంగారెడ్డిగారి ద్వారా నాతో చెప్పించుటయు లేక కొన్నివేళల రంగారెడ్డిగారే ఆ కోరికను నెరవేర్పుటయు సంభవించు చుండెను. ఇట్లు కుటుంబ మందలి యందఱచే నతడు ప్రేమింప బడుటచే నతడు మాయింటికి రాజువలె నుండెను. అతని యేకోరికయు నిరాకరింప బడకుండెను. బాల్యము నుండియే ఇతర బాలురవలె యీ బాలుడు స్త్రీలవద్ద యుండుట కాని దగ్గఱ పరుండుటకాని అలవాటు లేనివాడు. అతడెప్పుడు మగవారి దగ్గఱనే యుండుచు తన పిన తండ్రుల దగ్గఱనే పండుకొను చుండెను. అతడు తన తల్లి తర్వాత అత్యంతముగా తన పితామహిని ప్రేమించు చుండెను.

## పర్యటనము.

బాలుడు ౩ సంవత్సరముల యీడు కలవాడుగా నుండఁగా నేను నా తమ్ములగు కృష్ణారెడ్డితోను లక్ష్మారెడ్డితోను, నప్పుడు వరంగలు జిల్లా పోలీసు అధికారిగా నుండిన వేంకట రామా రెడ్డిగారితో నవాబు సాద్‌జంగుగారి వెంట యొక ఖూని కేసుకు పరిశోధన చేయుటకై మద్రాసునకు వెళ్లియుంటిని. ఈ బాలుడు మావెంట ప్రయాణము చేసెను మేము వెల్లిపురము చేరగా పుదు చ్చేరికి పోవు రైలు తప్పిపోవుటచే నచ్చటనే యారాత్రి నిలువ వలసి వచ్చెను. వేంకట రామారెడ్డిగారును నవాబు సాద్‌జంగు బహా ద్దరుగారును స్టేషనులోనే యుండిరి కాని మేము ఊరిలో నొక

తోటను జూచుటకై వెళ్లితిమి. బాలుడు స్టేషనులో నుండి యూను కొను చుండగా వేంకట రామారెడ్డిగారు మందలించిరి. ఎన్ని మారులు చెప్పినను వినడయ్యెను. వేంకట రామారెడ్డి గారు అతనిని యొక బెత్తముతో నొకటి రెండు దెబ్బలు కొట్టగా మెత్తబడి కొంతసేపటికి నిద్రించిరి. అతడు పెద్దవాడైన తర్వాత పలుమారు వేంకట రామారెడ్డి గారితో నిట్లుచెప్పు చుండెను. "మీరు నన్ను ఆనాడు శిక్షించుటలో నేమియు న్యాయము లేకుం డెను. నేను బాలునిగా నుంటిని. బాలురాడుకొనుట వారిస్వభావము. వయోవృద్ధులగు మీకది సరిపోకుండ వచ్చును కాని నా వయస్సు బాలురకది వినోదకరమైనదిగా నుండెను. నాచర్యల కట్టి శిక్ష తగి నదిగా నుండెను. మీరు అన్యాయముచేసి మీ పోలీసు పద్ధతుల ప్రకారమే యాచరించితిరి."

మేము మఱునాడు పుదుచ్చేరి చేరితిమి. అక్కడ ఒక దిన ముండి యటనుండి తిరుచనాపల్లికి డిసెంబరు ౨౫ వ తారీఖునాడు పోయితిమి. ముసాఫర్ఖానాలో ననేకు లుండుటచేత మాకు స్థలము దొరకుట కష్టమయ్యెను. అందుచే మేము వంటచేసు కొనుటకు వీలులేకుండెను. నవ్వాబు సాద్ జంగు బహాదరు గారును, వేంకట రామారెడ్డిగారును రైల్వే స్టేషనులోని వెయిటింగు హాలులో నిల చిరి. బాలుని వారిదగ్గరనే విడిచి మేము శ్రీరంగ పట్టణమునకు పోయితిమి. మేము సాయంకాలము తిరిగి వచ్చువరకు మావంట వాడొక చెట్టుక్రింద వంటచేయుటయు బాలుడు వాని దగ్గర కూర్చుని ఉల్లిగడ్డలను, ఆలుగడ్డలను కోసి యిచ్చుటను చూచితిమి. రెండు మూడు దినముల తర్వాత మేము బెంగుళూరునకు పోయితిమి.

ప్లాటు ఫారముపై మా సామాను నుంచి బాలుని కావలి పెట్టి మేము బండీ నేర్పాటు చేయుటకు వెళ్లితిమి. మేము తిరిగి వచ్చువరకు బాలుడొక మనుష్యునుచేతి ట్రంకుపట్టుకొని యున్న వానిని యడ్డగించి యుండుట జూచితిమి. పాపమా ప్రయాణీకుడు బిక్క మొగముతో నిలువబడి యుండెను. కారణము బాలుని విచారించగా నతడు మా పెట్టెను తీసికొని పోవుచున్నాడని చెప్పె ను. ఆతని దగ్గరనుండు పెట్టె మాదాని వలెనే యుండినను అదిమనది కాదని బాలునితో తెలియ జెప్పగా నప్పుడా ప్రయాణికుని బోని చ్చెను. బాలుడు చిన్న తనము నుండియే ప్రయాణమం దభిలాష కలవాడు. అతడు ప్రయాణము చేయుగోరి నప్పుడు తన తల్లిని విడిచి యుండుటను లెక్కించువాడు కాడు.

## పొరపాటు యొక్క మందలింపు

అతడు తనతమ్ముడగు మధుసూదనరెడ్డితో హైదరాబాదు లో విద్యాభ్యాసము చేయుచుండగా నొకనాడు తననేరమువలన నొక ఎలక్ట్రిక్ గోళ పగిలిపోయెను. తిరుమలరావుగారలనివందు లకై మందలించెను. మొదలతడు తన తప్పు నొప్పుకొనెను. కాని ఆతడు మరింత కోపముచేయగా నతడిట్లు జవాబు చెప్పెను. "నేను పగుల గొట్టినదైన అది మా తండ్రి సొత్తు. అతడు నన్ను శిక్షించిన నేనోర్చుకొందును. నీవు కావలసి యుండిన మా తండ్రితో చెప్పుకొనుము. నేను నీతండ్రి వస్తువును చెడగొట్టి నట్లుగా నీవు నన్ను భయపెట్టుచున్నావు. నేనిది సహించను." తర్వాత

వారిద్దరును నీ విషయమై నాకు వ్రాసికొనిరి. నేను తూష్ణీంభావము వహించి యుంటిని.

## నక్షత్రము పరస్పర సంబంధముల పరిశోధనము

అతడు ప్రతివస్తువుయొక్క తత్త్వమును పరీక్షించుటలో శ్రద్ధకలవాడు. అతనికి విమర్శనాజ్ఞానము విశేషమగుటచే మాకు దానికి దగునట్లుగా సమాధానము చెప్పుట కష్టసాధ్యమై యుండెను. అతడు నక్షత్రముల సృష్టిని గురించి విచారించెడివాడు. రాత్రికాల మందవేల ప్రకాశించును. పగలెందుకు కనబడవు అని యడిగెడివాడు. మాకీ విషయములందు ప్రవేశము లేనందుచే అతనిలే శాస్త్రీయమును బట్టి మాకు తోచునట్లు చెప్పుచుండెడివారము అంటితో నతడు తృప్తిపడక ప్రశ్నలపై ప్రశ్నలుచేయగా తుదకు మాకవి తెలియవని చెప్పవలసి వచ్చుచుండెను. అతని తృప్తిపఱచుటకింతకన్న మాకు వేరుపాయము కనబడకుండెను.

అతడు ౫ సంవత్సరముల వాడుగా నుండినప్పుడు తన పినతండ్రియగు రంగారెడ్డితోను రావు నరసింహారెడ్డి యను నొక బంధువుతోడను నొకనాడు పొలమునకు పోయెను. రంగారెడ్డి హాస్యమునకై నరసింహారెడ్డితో „నాపిల్లవాని గొంతుపిసికి చేతి బంగారు కడియములు తీసికొందము,, అని ఆపిల్లవాడు వినునట్లుగా చెప్పెను. మొదలావాలు డది హాస్యమని యెంచెను. కాని వార ట్లు చేయువారివలెనే నటింపగా ముగ్ధుడై యాబాలుడిట్లనెను. ‚నాయనా! నిజముగా మీరు నన్ను చంపదలచితిరా?'' ఈయమాయకపు మాటల విని పినతండ్రి వాని నెత్తుకొని కౌగలించుకొని నాయనా నిన్నుచంపువారెవరు? నీధైర్యము చూతమని యంటిమి

కాక" యని అనెను. రంగారెడ్డిగారీ యంశమును నెన్నడును మఱవరు. అమాయకపు బాలుని యిట్టిమాటల వినచో అత్యంత కఠినాత్ముల గుండెయు నీరు కాకయుండునా? ప్రపంచములో బంగారు, సొమ్ముల యాశచే నేమియు నెరుగని బాలుర చంపు జనులు ఎంత కఠినాత్ములో కదా! వారిగతి యేమగునో !దేవుడు అట్టివారిని రక్షించుగాత?

## బాల్యములోనతని యదృష్టము

అతడొక సంవత్సరముపై మూడునెలలో ఆరునెలలో వయస్సు కలవాడుగా నుండినప్పుడు నేను నల్లగొండ జిల్లా యాబ్కారీ గుత్తా తీసికొంటిని. ఆజిల్లాలోని పరిస్థితులు చాల హీనస్థితిలో నుండుటచే పూర్వపు గుత్తాదారులు చాల నష్టములపాలై యుండిరి. అందుచే సర్కారువారు వారియాస్తులను జప్తీచేసి వేలము వేయుటకై యేర్పాట్లు చేయుచుండిరి. షిక్మీదారులుకూడా చాల దుస్థితిలో నుండిరి. వారికొకపూటకు భోజనముకూడా దొరక కుండెను. కాని దైవకృపవలన మామూలా వృద్ధినొందెను. ఏర్పాట్లన్నియు సరిగా జరుగుచురాగా నేనీ మామూలా జనార్దనరెడ్డిదే యని చెప్పుచుంటిని. అతడు అది నాదేయని డప్పులు కొట్టుకొనుచుండెను. ఈ బాలునికి గ్రామఫోనకొఱకుపయోగించిన సూదులపై చాల ప్రీతియుండుటచే నొకతూరి యతని పినతండ్రియగు రంగారెడ్డిగారితనితో "తనమామూలా" తనకిచ్చిన తాను అతనికి సూదుల నిత్తునని చెప్పి యొప్పించెను. ఇట్లు "వ్యవహారము" ఏర్పాటయిన తర్వాత బాలుడు ఎన్నడును "తనమామూలా" ముచ్చటమె యెత్తకుండెను. "నేను నామామూలాను

ఇచ్చివేసినాను" అని చెప్పెడివాడు. ఇట్టి బాల్యదశయందును నీ బాలుడు "ఏదైనసనే నిచ్చివేసిన తర్వాత అది నాది కాదు" అను భావములతో నుండెడివాడు.

విద్యాప్రారంభము; క్రమ శిక్షణము.

౧౩౨౯ ఫసలిలో వరంగల్ జిల్లా పోలీసు మొహతెమీముగానుండియు నాటినుండి నేటివరకు నాసోదరునివలె నుండునట్టియు నాపూర్వస్నేహితులగు వేంకట రామారెడ్డిగారు అత్రాఫు బల్దాకు మార్చబడిరి. కొన్నిదినముల తర్వాత నాకుమారులను యింగ్లీషు గృహములోనుంచి విద్యానైతికములందు శిక్షణము జరుపుటకై వారు కోరిరి. ఈ సూచన ప్రకారము ౬ సం॥ల జనార్దనను ౮ సంవత్సరములకు కొంచెమెక్కుడు వయస్సుగల మధుసూదనును డా॥ ఫారింగుటన్ గారి యింటిలో నొక వంటవాని నిచ్చి నెలకు ౬౦ రూపాయలు వారిశిక్షణకై యేర్పాటుచేసి భోజనము ఖర్చులు నేనేభరించకొనునట్లు యేర్పాటుచేసితిని ఇంతటి బాల్యదశయందు వీ రిరువురు క్రొత్తస్థలములో కొత్త పరిస్థితులలో నిర్విచారముగా నుండిరి ఆయింటిలో కొన్నిసమయములందు మిసెస్ ఫారింగుటన్ గారును మరికొన్నిసమయములందు వారికుమార్తెలును విద్యనేర్పుచుండిరి. సరియగు శిక్షణమక్కడ జరుగుటలేదని నాకు విశదముకాగా రంగారావుగారిని వారికి తెనుగు ఇంగ్లీషు ప్రతిదినము రెండుమూడు గంటలు బోధించునట్లేర్పాటు చేసితిమి. ఉర్దూ నేర్పుటకొక మౌల్వీనిగూడ నేర్పాటుచేసితిని ఇంగ్లీషువారి యింటిలో నేర్చిన దంతయు తట్టలో ముఖము కడుగుకొనుట చంచా, కత్తి ముండ్ల చంచా (Fork) భోజనము చేయునప్పుడుపయోగించుట

తప్ప నేరేమియు లేదు. రెండు సంవత్సరముల కాలములో వారు జ్ఞాపక ముంచు కొనదగినంత కూడ నేర్చుకొనలేదు నేను హైద్రా బాదుకు నా వ్యవహారముల విషయమై పోయినప్పుడంతయు వారిని జూచి వారు ఆరోగ్యముగను సౌఖ్యముగను నుండుట చూచి తృప్తి చెందుచుంటిని.

నేనులేనికాలములో వేంకటరామారెడ్డిగారే వారిని విచా రించుకొనుచుండిరి ఇట్లువారు సుమారు రెండు సంవత్సరములు ఫారింగుటర్ గారి యింటిలో నుండిరి ౧౩౨౦ ఫసలిలో నేను కుంటకోడ్డుదగ్గరనొకయింటిని ౮౫౦౦౦రూపాయలకుకొంటిని౧౩౨౧ ఫసిలిలో బాలురు ఇంగ్లీషుగృహము లోనుండుటవలనలాభము లేదని గ్రహించి కొనినట్టియీయింటికి పిలుచుకొని వచ్చితిని తర్వాత యీ యింటిని పెంచి మార్పులుచేసి దానికి'లక్ష్మీవిలాసు' అనిపేరు పెట్టితిని. వారివిద్యకై పి. డబ్ల్యు. డి. శాఖయొక్క మొహతెమిమాము గా నుండి యుపకార వేతనముపొందినరంగారావులను వారిని నెలకు ౧౦౦ రూపాయలు జీతమిచ్చి యేర్పాటు చేసితిని. అతను వారికి ఇంగ్లీషుఉర్దూబోధచేయుచుండెను వర్మగారినివారికి తెనుగునేర్పుటకై యేర్పాటు చేసితిని ౧౩౨౨ వ ఫసలిలో నేను జ్యూడిషల్ పరీ క్షకుకూర్చునుటకై హైద్రాబాదులోనాభార్యతోగూడ ౧౫ ఇస్ఫం దారునుండి ౧౫ ఫర్వర్ది వరకును మరల ౧ బహిమన్ నుండి ౧౩౨౩ఫ॥ ౧౫ ఫర్వర్ది వరకును తర్వాత ౧౩ ౨౪ ఫ॥ ౧౫ బహమన్ తర్వాతను నుంటిని. అప్పటినుండియు నేను నా కుమారుల విద్యాభ్యాసమునకై నగరములోనే యుండుటయైనది. నేను ఎంతధనము సంపాదించినను

నాబాలుర విద్యాసంపాదనమె యుత్కృష్ట సంపాదనయని నా
గ్రాహ్యమే.

విద్యయు క్రమశిక్షణమును లేకుండిన నెవ్వని పిల్లలు
వృద్ధికి రానేరరు. ధనమునకు తోడుగా విద్య యబ్బినట్లి
బంగారునకు పరిమళము కలిగినట్లుండును. ఇక్కడ నేను స్థిరనివా
మేర్పాటు చేసికొనిన తర్వాత నాబంధువగు గోపాల వేంకటరెడ్డిగా
కుమారులగు పి. యస్. రెడ్డిగారిని పద్మనాభరెడ్డిని విద్యానిమిత్త
పిలిపించి కొంటిని. మొదటివారు ఇంటర్ పరీక్షలో కృతార్థు
కాలేదు. ఇప్పుడువారు గుత్తాపనులు చేయుచున్నారు. రెండవవా
ప్రకృతము నిజాము కాలేజిలో ఇంటర్ తరగతిలో చదువుచున్నా

మేము హైదరాబాదులో నివాసముచేయ మొదలిడిననా
నుండియు నాబాలుర విద్యాభివృద్ధి క్రమముగా నుండెను. జనార్ధనరె
ఇంజనీయరింగులోను సైన్సులోను చాల అభిలాష యుండెను. సై
ఫిక్ అమెరికన్ అను వారపత్రికకు ఆతడు చందాదారుడు
నుండెను. అందునుండి నూతన భావముల సంపాదించు కొనుచుండె
ఇండ్లకట్టడములలో గొత్తస్థానులు వ్రాయుచుండెడి వాడు. నే
బొంబాయి పోయినప్పుడంతయు నతడునన్ను ఇంజనీయరింగు సంబ
ధమగు మెకానిక్ సామానులను తెమ్మను వాడు కొన్ని సం॥ల తర్వా
నతడు, సిటీహైస్కూలులో చదువుచుండినప్పుడు రంగారెడ్డిగారి
తనకొక "లేథ్" కావలెనని చెప్పి నౌరోజీగారి దగ్గఱ నుండుదాని
తెప్పించుకొనెను. దానిపై నతడు గుండీలు మున్నగు సామానుల
తయారు చేయుచుండెను. విద్యార్థులు తయారుచేసిన హస్తపరిశ్రే
లను ప్రదర్శించుటకై విద్యాశాఖచే నొక ప్రదర్శన మేర్పాటుచేయబ
యుండెను. అతని పరిశ్రమలను చాలమెచ్చుకొని యొకబహుమా

మిచ్చియుండిరి. ఈ పనులు చేయుటలో డైనమో మారుగానతడు ఎలెక్ట్రిక్ పంఖా నుపయోగించు చుండెను. ఈపనులలో బోధించుట కతని కేగురువును లేకుండెను. అతనికి గురువులెవరైన నుండిన ఆగురువు "సైన్టిఫిక్ అమెరిక" పత్రికయే. అట్టి పుస్తకమును నతడు తెప్పించు కొనుచుండెను.

ఇతర బాలురతో పాటిగ నేర్చుకొను విద్యవలె నింటిలో నేర్చిన విద్య సరిపోలదని యోచించినేను అతనిని మధుసూదనరెడ్డిని సిటీహైస్కూలులో చేర్చితిని. ఆ స్కూలునకు అధికారిగా ఫజల్ మహమ్మదుఖానుగా రుండి యుత్తమమగు విచారణ కావించుకొను చుండిరి. కుముదినీదేవిని, జగన్మోహనును నింటిలోనే చదివించు చుంటిని.

వారిని స్కూలుకు తీసికొనిపోయి యింటికి తెచ్చుటకై జట్కా ఖర్చులకై వారికి కావలసిన పైకము ఇచ్చుచుంటిని. స్కూలు నుండి వారువచ్చిన తర్వాత వారు కొంత అలసట తీర్చికొని యాడు కొనపోవు చుండిరి. సాయంకాలములందు ఉపాధ్యాయుని దగ్గఱ పాఠములు నేర్చుకొను చుండిరి. జనార్దనరెడ్డి కొన్నిమారులుస్కూలు పాఠములను గురించి యసమ్మతిని తెలుపుచుండెను. పిల్లలు తమ కిష్టమువచ్చినట్లు చదువుటయే మంచిదనియు ఎద్దులను కాడికి కట్టి నట్లు బలవంతపెట్టకూడ దనియు చెప్పెడివాడు.

ఇంగ్లాండునకు పోయినతర్వాత నిదే ధోరణిలోనే విద్యావిష యమై వ్రాయుచుండెడివాడు. తన పినతండ్రికికూడ నిదేవిధముగ వ్రాయుచుండెను. స్కూలులో నుండినప్పుడు తన పాఠశాలా పుస్త కములేకాక స్కూలుగ్రంథాలయము నుండి నానా పుస్తకములను

తెచ్చి చదువుచుండెను. ఇతర స్థలములనుండి కొన్నిమారులు గ్రంథములను క్రయమునకు తెప్పించుచుండెను. అతడెప్పుడు బడిపాఠములు చదువుచుండడు. ఒకటి రెండు మారులు మాత్రమే అవలోకనము చేయుచుండెడివాడు. స్కూలులో ఫజల్ మహమ్మదుఖాను గారును నితరులును నీతనిపై ప్రేమకలవారు. తన తరగతి పంతులు నతనిని చాల ప్రేమించు చుండెను. ప్రతిశుక్రవార మతని తోడిబాలురు మాయింటికి వచ్చి యతని సైన్టిఫికు వస్తువులను ఇంజనీయరింగు వస్తువులను చూచి సంతోషించెడి వారు. పాఠశాలలో సహిత మతడు సైన్సుపై యభిమానము చూపించెడివాడు. అతడు తన జేబులో పోస్టుకార్డు లెల్లప్పుడును నుంచుకొని తన కేవైన పుస్తకములుగాని అవసరముండిన వెంటనె వ్రాసితెప్పించుకొనుచుండునని నేను వినెడివాడను.

మూడు సంవత్సరము లిట్లు చదివిన తర్వాత నతడు మిడిల్ స్కూల్ పరీక్షలో కూర్చునెను. పరీక్షా ఫలితములు ప్రకటించు సమయములో నొక యభిమాని యతనితో తానెట్లు పరీక్షలో వ్రాసినది విచారించెను. జనార్దనరెడ్డి తాను తనశక్తికి తగినట్లుగా వ్రాసితినని జవాబు చెప్పెను. "నీ వేశాఖయందైన సరిగా వ్రాయనట్లైన నేను నీకొఱకై సిఫారసు చేయుదునని" అతడు చెప్పగా నతడిట్లు జవాబిచ్చెను "ఇట్టి సిఫారసు పత్రములపై నావిద్య నాశక్తి యాధారపడదు. మీ కిష్టముండిన నింకెవరికైన సిఫారసు చేయవచ్చును"

ఈ జవాబువల్ల పాపమా పెద్దమనిషి విచారపడెను ఏలయనగా అతడు అవసరమైన పక్షమున ఆయనకు తోడ్పడవలెనని నిజముగా తలచియుండెను. అవసరములేకుండినచో నా కక్కర లేదని

వందన పూర్వకముగా చెప్పవలసియుండెను కాని ఆయన తనకుపకారము చేయగోరినవారి విషయములోగూడ ఆత్మగౌరవమును ధృవపరిచెను.

ఇదిజరిగిన ఆరుదినముల తరువాత మేము బొంబాయిలో నుండగా మిడిలు పరీక్షాఫలితములు ప్రకటింపబడెను జనార్దనరెడ్డికి నాలుగుగుణములు(Marks) తక్కువైనందున మొదటి తరగతిలో కాక రెండవ తరగతిలో అతడు ఉత్తీర్ణుడయ్యెను. అతడు సంతోషించియేయుండెను కాని మొదటి తరగతిలో ఉత్తీర్ణుడై యుండవలసినదని రంగారెడ్డిగారి మనోరథము కనుక వారు ఫలితమునకు సంతోషించక "నీవు మొదటితరగతిలో ఉత్తీర్ణుడవై యుండిన బాగుండెడిది" అనిరి ఆయన పైనిరుత్సాహవచనమునకు నొచ్చుకొని "ఏమి లాభము పినతండ్రిగారు సంతోషించలేదు" అనినాతో చెప్పెను దీని తరువాత చదువుసాగెను మూడు సంవత్సరముల తరువాత స్కూలు ఫైనలు పరీక్షలోకూడ రెండవతరగతిలో ఉత్తీర్ణుడాయెను. పాఠశాల ప్రిన్సిపాలగు ఫజులె మహమ్మదు ఖానుగారు అతనిని తన కుమారునివలె ప్రేమించుచుండిరి.

స్కూలు ఫైనలు పరీక్షయొక్క మొదటి సంవత్సరపు తరగతిలో చదువుచున్న కాలములో ౧౩౨౮ ఫసలిలో హైద్రాబాదు నగరము ఇన్ఫ్లుయెన్జా వ్యాధిచేత బాధితమయ్యెను అనేకులు దీని వాతబడిరి చనిపోవుచున్నవారి సంఖ్యాబాహుళ్యమునుచూచినచో దైవముయొక్క ఆగ్రహము మనపైనబడెనా యనునట్లుతోచెను ఈ వ్యాధివలన నాబావమరదియొకరు చనిపోయెను అతడుమంచి చదువుకున్నవాడు సమర్థుడు చాలతెలివికలవాడు. ఎల్లందూరు

తాలూకాకు తహసీలుదారుగా నుండెను ఆసందర్భమున మాయింటిలో గూడ అందరును వ్యాధిగ్రస్తులై యుండిరి. అప్పుడు డాక్టరు మల్లన్నగారు ఆయన ప్రతిదినము వచ్చుచుండువాడు వైద్యశాలలో ప్రతిసారి మందుదొరకజాలదయ్యెను దినమునకు ఐదువందల చొప్పున చనిపోవుచుండిరి ఇట్టికఠినసమయములో అతడు ఆరోగ్యముగ నుండెను. అతడు స్వయముగా వెళ్లిమందు తెచ్చుకొనుచు రోగుల కుపచారము సేయుచుండెను అతడు ఆలోపేథిక్కు వైద్యపద్ధతిని తప్ప మరేపద్ధతి వైద్యమును మెచ్చువాడుకాడు యూనాని వైద్యులను ఆయుర్వేద వైద్యులును కేవలము ఊహాపైన రోగులకు చికిత్సచేయుచుందురనియు రోగిఅదృష్టము బాగుండినచో నయమగుచున్నదనియు లేనిచో చావునిశ్చయమనియు అతడు అభిప్రాయపడుచుండెను ఆయన తల్లియుముత్తువ తల్లియు ఈవ్యాధివలన బాధపడుచుండి నప్పుడు వారు జీవింతురను నాశలేక యుండెను వారికి కొన్ని వేళల ఆలోపేథిక్కు వైద్యమును మరికొన్ని వేళల ఆయుర్వేద వైద్యమును మరి కొన్నిసమయములందు సాహాసాహెబు వైద్యమును చేయించుచుండిరి. అతడీ ఈ పద్ధతిని అసహ్యించుకొనెను ఇంగ్లాండుకు పోవువరకు అతని తల్లిగారికి ఆరోగ్యము కలిగెను గాని ముత్తువ తల్లిగారిస్థితి అపాయకరముగ నుండెను. ఇట్టి స్థితిలో అతడు వారిని వీడుకొనెను అతడు బొంబాయినుండి వెళ్లిన వారము దినముల తరువాత అవ్వగారు హైదరాబాదులో చనిపోయిరి. అతని కీసంగతి తెలసిన తరువాత అతడిట్లు వ్రాసెను. ‟ఆమెకు అంత్యకాలము ప్రాప్తించెనను మాట నిజమేకాని, ఆయుర్వేద చికిత్ససాహాసాహెబు వైద్యము ఆమెను చంపినవి!”

బాలురు తప్పులను చేయుచుండుటయు, తల్లిదండ్రులు తెలసికొనుచుండుటయు సాధారణముగా జరుగుచుండును అతడును

తప్పిదములు చేయువాడే కాని మందలించినప్పుడు లేదనువాడు కాడు. మీదు మిక్కిలి తన తప్పిదమును స్పష్టముగా ఒప్పుకొను చుండెను. కాని అబద్ధములాడి తప్పించుకొన జూచుచుండలేదు. నాకు తెలసినంతలో, ఒకసారి మాత్రము అతడు అబద్ధమాడెను. అందు మీదట పినతండ్రి రంగారెడ్డిగారు తన అయిష్టతను ప్రకటించెను. దీనివలన కలిగిన మనస్తాప మూలమున అతడు మూడు దినములవరకు కన్నీరు గార్చుచు పశ్చాత్తాప పడుచుండెను. ఆ తరువాత మరల అబద్ధము అతని నోటనుండి వెలువడలేదు. తన పొరపాటు నొప్పుకొని, చిన్నతనము వలన నట్టిపని జరిగినదని ప్రతివాదము సల్పును. మా కుటుంబమునందు పిల్లలను ఎల్లప్పుడును భయపెట్టు నలవాటు మాకులేదు. మేము వారిని స్పష్టముగా మనసులోని మాటలను బయలుపెట్ట నిత్తుము. ఈ పద్ధతి వలన పిల్లల మనోభావములను మేము తెలుసుకొని తన్మూలమున మంచి విషయములను గ్రహించి ఇతరుల విషయములో అభివృద్ధి సాధనములను సమకూర్చ గలిగితిమి. అతడు మనోదార్ఢ్యము కలవాడు. తర్కశాస్త్రము చదివినవాడు కాడు, కాని సహజముగ తార్కిక స్వభావము కలవాడు. అందరిని సమానముగ జూచువాడు. స్వార్థపరత్వము లేక శక్తికొలది ఇతర బాలురకు తోడ్పడు చుండెను. తనకు పెద్దలిచ్చు దాని నుండియు, జట్కా బాడుగ నుండియు మిగిలిన పైకమును రెడ్డివిద్యార్థుల సహాయార్థము వినియోగించు చుండెను. పాఠశాలకై వెడలు నప్పుడు, తల్లితో, తనకును సోదరులకు బడిలోని బీద బాలురకును చాలినట్లు అన్నము సమృద్ధిగా పంపుమని చెప్పుచుండు వాడు. నాతోను, రంగారెడ్డి గారితోను చెప్పి ఒక రిద్దరు విద్యార్థులకు వేతనము లిప్పించి యుండెను,

వీరిప్పుడు చదువు పూర్తిచేసికొని ప్రభుత్వోద్యోగము సందు న్నారు. వారిలో ఒకరు డాక్టరు, రెండవవారు ఇంజనీరు. ఉపా ధ్యాయుని యెడలను, విద్యార్థుల యెడలను, అతని ప్రవర్తన సమముగా మర్యాదతో గూడినదై యుండినందున అందరాతని ప్రేమించుచుండిరి. బడినుండి వచ్చిన తరువాత తన పాఠ పుస్తక ములను చదువుకొని. హోంవర్కుచేసి. ఆపైన ఆడుకొనుటకు వెళ్లు చుండువాడు. అతను తన పుస్తకములను జాగరూకతతో పఠించి. తరువాత ఆడుకొనబోవును. అతడు చదువు విషయములో అశ్రద్ధ కలవాడనియు అపేక్షలేని వాడనియు మేము తలంచు చుంటిమి. కాని పరీక్షా ఫలితములను, ఆయన యోగ్యతను వినినప్పుడు మా పొరపాటును దిద్దికొనుచుంటిమి. పాఠశాలా సంబంధమైన పుస్తక పఠనము ముగిసిన తరువాత మిగిలిన కాలములో ఆయన గ్రంథాల యములోని పుస్తకములు చదువుటయందు గడపుచుండెను. ఎప్పుడును ఏదో యొక పుస్తకమును చదువుచునే కానవచ్చు చుండెను.

ఆకాలమున ౧౩౧౨ ఫసలిలో హైదరాబాదునందు ముఖ్య ముగా రెడ్డివిద్యార్థులకొరకొక వసతిగృహము స్థాపింపబడినది. అప్పటినుండి అతడు ప్రతిదినము అచ్చటికి వెళ్లుచుండెడి వాడు. అక్కడనుండు విద్యార్థులతో కలిసిమెలిసి యుండుట, వారితో ఆటలనాడుట అతని దినచర్యలో చేరెను. వసతిగృహ స్థాపనానం తరము, వారమునకొకసారి — గురువారము దినమున — విద్యార్థు లందరుగూడి ఏదేని యొక పాఠశాలా విషయమును గూర్చి ప్రసం గించుచుండిరి. ప్రతిబాలుడును ఏదైన వ్యాసమును చదువుటయో, ప్రేక్షకుల యెదుట ఉపన్యసించుటయో జరుగుచుండెను. దీనిలో

నాతఁడు ముఖ్యమగు పాలును గైకొనుచుండెను. యూరోపునకు వెళ్ళువరకు ఈ ప్రకారము జరుగుచునే యుండెను. ఈ కారణము వలన వసతిగృహ విద్యార్థులు అతనిని, అతఁడు విద్యార్థులను మిక్కుటముగా ప్రేమించుట ఏర్పడెను. తుదివరకు అతని మనస్సులోని కోరిక, వసతిగృహాభివృద్ధియు, దాని పరిపాలనము బాగుగా జరుగుటయు అయియుండెను. వసతిగృహావరణము యొక్క పారిశుద్ధ్యతను గూర్చి అతనికెక్కువ శ్రద్ధకలిగియుండెను. కుశాగ్రబుద్ధులగు విద్యార్థులకు వేతనములిచ్చి వారికి బాగుగా విద్య నేర్పించవలయునని యతఁడు కోరుచుండెను. వసతి గృహాధికారులతో అతఁడు తరచుగా నీవిషయమును గూర్చి మాట్లాడుచుండెను. ప్రజాహిత సంస్థల సభాసదులును, మహాజనులును తమ మాతృదేశమునకు ఉత్తమ సేవకులుగా నుండవలయు ననునది అతని యభిప్రాయము.

పాఠశాలలో నేర్పబడు విద్యయందు గల శ్రద్ధయేకాక అతనికి ఉపాధ్యాయుల సహాయముతో యంత్రముల నిర్మించుట యందెక్కువ స్వతంత్రజ్ఞాన మున్నట్లు కనుపడెను. అతడు సర్వదా ఇట్టిప్రయత్నములలో నిమగ్నుడుగా నుండెను. తుదకుజాంబాగులోని స్వగృహమునుండి వనపర్తి రాజాగారి బంగ్లావరకు సుమారు ౩౦ గజములదూరము నిస్తంతి వార్తల నంపుటయందు విజయము గాంచెను. ఈ యంత్రసాధనమును అతడు స్వయముగనే సిద్ధముచేసి ఒకటి తనయొద్ద నుంచుకొని రెండవ దానిని శ్రీరాజాగారి యింటిలో పెట్టెను. ఈ సాధనము టెలిగ్రాపు వార్తాహారణ పద్ధతిపైన

నుపయోగింప బడుచుండెను. చిహ్నాహములు ఎలెక్ట్రిసిటీ బల్బులలో కానవచ్చున ట్లమర్చబడి యుండెను. స్కూలు ఫైనలు పరీక్షలో కడతేరిన తరువాత నే నతనిని ఇంగ్లాండు పంప వలయునని తలంచితిని. కాని ఇచ్చట సీనియర్ కేంబ్రిడ్జి పరీక్షలో ఉత్తీర్ణుడైన పక్షమున అచ్చటి కళాశాలలో ప్రవేశించుట ఎక్కువసులభమగునని నిశ్చయింప బడెను. నాయీకోరిక ననుసరించి, జూలై నెలలో అతడు గ్రామర్ స్కూలులోని సీనియర్ కేంబ్రిడ్జి తరగతిలో ప్రవేశించెను. టరమునందు ఆలస్యమైనందువలన అతనిని తరగతిలో చేర్చుకొనుటకు ప్రధానోపాధ్యాయుడు అభ్యంతరము చెప్పెనుకాని తరువాత చేర్చుకొనెను. కొన్ని దినములతరువాత ఆయుపాధ్యాయుడు "లెక్కలలో నన్నడుగవలసినపని లేదు. జనార్దనరెడ్డితో ఆలోచించుడు" అని చెప్పసాగెను. అప్పటినుండి ఆ యుపాధ్యాయునకు జనార్దనరెడ్డిపైన ప్రేమ అధికమైనది. పాఠశాలను డియే అతను పరీక్షకై పంపబడెను. ఆకాలమున ఉర్దూ రెండవభాషగా నుండనందున అతడు ఫారసీ రెండవభాషగా తీసికొనవలసి వచ్చినందున ఆభాషను చదువ మొదలిడెను. అయినను దానిలో తగినంత సామర్థ్యము అంతత్వరలో కుదరనందున పరీక్షలో తప్పుట తప్పినది కాదు. అందున ఫిల్లిప్సుగారు అతని కొరకని పై యధికారులకు వ్రాసి, ఉర్దూను రెండవభాషగా గొనుటకు అంగీకారము బడసెను. ఈ విధమున ఫిల్లిప్సుగారి సహాయముతో నతడు పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను.

నేనతని నింత ఎక్కువగా పొగడి యున్నను, అతని యందలి లోపములను ఎత్తిచూపుట కూడ అవసరమైయున్నది. అతనికిని అతని సోదరునకును ఇతర భాషలను మాతృ భాషను నేర్చ

కొనుటయందు ఆతురత ఏమాత్రమును లేదు. కనుక వారు రెండవ భాషయందెప్పుడును దుర్బలులుగా నుండిరి. కనుక అతడు ఇంగ్లాండు వెళ్లుచుండినప్పుడు, నేను, "ముందు వ్రాయు ఉత్తరములు నా కింగ్లీషురాదు కావున ఉరుదూలోనే వ్రాయు"మని చెప్పితిని. అతడు నాయాజ్ఞను పాలించెను. అందువలన స్పెల్లింగు పొరపాట్లు కొన్ని సార్లు కానవచ్చినను, దస్తూరియు భాషాజ్ఞానమును వృద్ధిపొంది యుండెను.

సీనియరు కేంబ్రిడ్జి పరీక్షాఫలితములు వెలువడిన తరువాత నతనిని ఇంగ్లాండునకు ఏప్రిలులో పంపవలయునని యుండెను. నేనునంగీకరించితిని. "మెసర్సుధామస్ కుక్కు అండుసన్సు" మొదలగువారితో పత్రవ్యవహారము ఆరంభమయ్యెను. ప్రభుత్వమువారికి విద్యార్థి వేతనముల కొరకు దరఖాస్తుల పంపవచ్చునని అభ్యర్థుల కొరకు ప్రకటనలు జరిగెను. అట్టివేతన మొకటి తనకొరకు సంపాదింప యత్నింతునని చెప్పితిని. పట్టణపు కొత్వాలుగారగు శ్రీయుత వేంకటరామారెడ్డి గారు కూడ చెప్పిరి. "ప్రభుత్వమువారు విద్యార్థి వేతనము నియ్యకపోయినను మీరు నన్ను పంపెదరు; కనుక నాకొరకు విద్యార్థి వేతనమునకై ప్రయత్నించవలదు. నాకు విద్యార్థి వేతనము దొరికినపక్షమున, పేదవాడుగానున్న కారణమున నాకంటె అట్టి వేతనమునకు ఎక్కువ అర్హుడగు విద్యార్థి దీనిని పొందకపోవుట తటస్థించును. కనుక నాకట్టి ప్రయత్నము ఇష్టము లేద"ని చెప్పెను. 'లా' గాని సాహిత్యశాస్త్రము ( Arts )చదువుట గాని మంచిదని కొందరు మిత్రులు సూచించిరి. కాని అతడు ఇంజనీరింగునే అన్నిటికంటె శ్రేష్ఠతమముగా భావించెను ఎంతో చర్చ

జరిగెను. ఎలా' యను సాహిత్యశాస్త్రమును మానవులను ఎక్కువ నాగరికులుగజేసి దేశాభివృద్ధియందు పాల్గొనుటకు వలయు విశాల దృష్టిని ప్రసాదించునని ఆయనకు బోధించిరి. "ఇట్టివారిమూలమున నాగరికత నష్టముచెందును., జనులు సాధారణముగా చెడ్డభావము లను ప్రజలలో వ్యాపింపజేయుటకు కారకమగును. అట్లుగాక ఇంజ సీరింగువలన నాగరికతయు, ప్రాపంచికాభివృద్ధియు కలుగును" అని యతడు వాదించెను. ఎట్లైననేమి, బాల్యమునుండి అతనికి ఇంజనీరింగుపైన ఎక్కువ మక్కువ యుండినందున, దానిని చదు వుటయే మంచిపనియని నేను తలచితిని. యూరోపునకు అతడు పంపబడుటకు నిశ్చితమైన తరువాత, "నూకల నారాయణరెడ్డిగారు కూడ చదువుకొనుటకై యూరోపునకు బోవ నిశ్చయించినారు కనుక అయనతండ్రితో మీరు మాట్లాడిన పక్షమున ఆయన వచ్చుటకు వీలు కలుగును. ద్రవ్య సహాయము అవసరముగా నున్నచో దయచేసి ఇప్పించుడు' అని అతడుకోరగా నేనంగీకరించి జమ్ములపల్లికిపోయి రంగారెడ్డిగారితో మాట్లాడితిని, కాని నేను ధనమిచ్చెదనని చెప్పినను, కుమారుని పంపుట తన కిష్టములేదని చెప్పి క్షమాపణ కోరెను. కాని తరువాత జనార్ధనరెడ్డి వెళ్లు నాటి సాయంత్రము వేళ, తనకుమారుని పంపుటకిష్టపడెను. ఆసమయ మున నే, వనపర్తి మహారాజగారు గడ్డంపల్లి దామోదరరెడ్డి గారిని పంపుటకుగాను నెలకు ౧౦౦ రూపాయల విద్యార్థివేతన మనుగ్ర హించిరి. మడికొండ వాస్తవ్యులగు గోపాలరెడ్డిగారు కూడ తమ కుమారుని అమెరికాకు పంపుట కంగీకరించిరి. ఈవిధము ఆ సంవ త్సరము ముగ్గురు విద్యార్థులు ఇంగ్లాండునకును, ఒకరు అమెరికా కును పంపబడుట నిశ్చయించబడెను. రెడ్డి వసతిగృహ నిర్వాహకులు

ఈసంగతి విని సంతోషించి, బయలుదేరుట కొకదినము ముందు ఈ విద్యార్థులకు వీడ్కోలువిందు చాలగొప్పగా చేసిరి. ఆనాడు శ్రీ. శ్రీ. గద్వాల మహారాజు గారు అధ్యక్షత వహించిరి. విద్యార్థులకు హితబోధలు చేయబడెను. జనార్దన రెడ్డి ప్రత్యుత్తర మొసగుచు దేశమునకును జాతికిని రాజునకును సేవచేయుటకై వలయు విద్యనార్జించుటకు శక్తికొలది పనిచేసెదననియు ఇలరులును యూరోపునకు తమ బాలురనంపుటకై ప్రోత్సహింప బడునట్లు తానెప్పుడును ఈవిషయమును దృష్టియందుంచుకొనెదననియు వక్కాణించెను. ఆతనియొక్క భావములను మనోరథములను దృష్టిలోనుంచి చూచిన పక్షమున జీవించియేయున్నచో దేశకార్యధురంధరుడయియుండునని స్పష్టముగా గానవచ్చుచుండెను బయలుదేరుటకు రెండు మూడు దినములు ముందు అతనిసామానులను సిద్ధపరుచుకొనెను ప్రాతవస్తువులలో తానుచాల ప్రియముగా దలచుచున్న "లేథ్" యంత్రమును మాత్రము వుంచుకొని మిగిలిన వానిలో కొన్ని సోదరునకును మరికొన్ని వారివారి పదవికి తగినవిధమున నౌకరులకును ఇచ్చెను. నగదుబహుమానములు కూడ ఇచ్చియుండెను. తాను కొని ప్రతిదినము ఏదోయొకటి అచ్చొత్తుచుండిన టైపురైటరును ఉంచుకొనుమని నాకిచ్చెను. "నాకింగ్లీషు రాదుకదా నేనుదీని నెట్లు ఉ ప యో గిం చ గ ల ను" అం టి ని. ఆసమయమున హృదయము చింతాపరవశమై యుండుటవలన నేనేమియు మాటలాడలేక పోయితిని. తల్లియెదుట ఆతనిని "కూర్చుండుము. నీతో కొంతచెప్పవలసియున్నది" అని నేనాతనితో వర్త

మానమును గూర్చియు భవిష్యత్తును గూర్చియు చెప్పితిని. ఆ సంగతుల నిచ్చట వివరించు టనవసరము. అతని మానసము చింతాకులమయ్యెను ఏడువసాగెను. ఆసమయమును తలచుకొన్నప్పుడు నామనస్సు తల్లడిల్లుచున్నది. మరునాడు తనవెంట రాజాలనివారియందరితోను అతడు సెలవుగైకొనెను. అతనితల్లిస్థితి వర్ణనాతీతముగనుండెను. ఒక ప్రక్కన ఆమె తల్లిమృత్యుశయ్యపైన నుండెను. వేరొక ప్రక్కన అనుగు కుమారుడు దూరదేశమునకుప్రయాణమై పోవుచుండెను. కుమారుడు పోవుచున్న ఉద్దేశముయొక్క యౌన్నత్యమునుదృష్టియందు తన శరీర మనారోగ్యముగ నున్నను ఆమె ధైర్యమును ఓర్పును అవలంబించి కుమారుని ముఖమున కుంకమతిలకమును దిద్ది పూలహారమును తెప్పించి మెడలోవేసి దీవెనలిచ్చి వీడుకొలిపెను. అదియే తుదిసెలవాయనిపించినది. అక్కటా! ఆమె తనకుమారుని కంఠమున వేసిన పూలహారము ఈ జన్మమున తుదిహారమే యయ్యెను.

అతడు మనోదార్ఢ్యము కలవాడును ఆత్మగౌరవపూరితుడునై యుండెను. ఆతడు యూసుఫుద్దీనుగారికి అనుగుమిత్రుడు స్నేహమున్నంత వరకు ఆతడు వారియెడ ప్రమాణబుద్ధితో మెలగెను. కాని మిత్రుడు అప్రమాణ పద్ధతిలో దిగెనని తోచగానే ఆతడు ఆ స్నేహబంధమును త్రెంచుకొనెను. తరువాత నేనును కృష్ణారెడ్డియును ఆతనితో ఎంతోచెప్పితిమి. యూసఫుద్దీను గారును అతని సమాధానపరుచుటకు చాలయత్నించెను. కాని అతడు వినలేదు. ప్రయాణసమయ మాసన్నమైనప్పుడు నే నంటిని ‘‘చూడుము నీవు చాలకాలము నివసించుటకై దూరదేశమునకు పోవుచున్నావు

ఏది ఎట్లుండునో తెలియదు కనుక నీ మిత్రుని కలిసికొని సెలవు పుచ్చుకొనుము" కాని అతడు అట్లుచేయక ప్రయాణమై పోయెను. పోవునప్పుడు కొమ్మాల అయ్యంగారువారికి నమస్కరించి వెళ్ళవల సినదని తల్లిచెప్పెను 'నేనట్లుచేయ'నని అతడు బదులుచెప్పెను. ఈశ్వర సాన్నిధ్యమున మానవులందరు సమానులు. ఒకడు రెండవవానికి సాగిలబడ నక్కరలేదు. ఎక్కువగా బలవంత పెట్టిన మీదట "నమస్కారము" అనిమాత్ర మనెదనని చెప్పి ఆ ప్రకారము చేసి బయలుదేరెను.

నేనును, అతని పినతండ్రులు, సోదరులు, తోబుట్టువులు అతనిని వీడుకొలుప బోయితిమి. అతని వెంట వెళ్ళుచున్న ఎమ్. ఎమ్. రెడ్డిగారు కూడ ప్రయాణ సన్నాహముతో వచ్చెను. అతని తాత ఐ. వి. రెడ్డిగారు, ఎమ్. ఆర్. రెడ్డిగారు కూడ అతనిని పంపుటకు వచ్చిరి. వెడలునప్పుడు అతని మనస్సు చాల కొందల పడెను. బొంబాయి ప్రవేశించిన తరువాత పిల్లలకు వారు కోరిన వస్తువులను పారితోషికములుగా గొనియిచ్చెను. ౧౯ వ ఆగస్టు ౧౯౨౨ నాడు అతడు మమ్ములను కౌగలించుకొని "నర్కొండ" యను ఓడపై నెక్కి వెడలెను. కొంత సేపటిలో స్టీమరు మాకు కనపడకుండ పోయెను. దానితో పాటు ఇప్పుడు మా కన్నులలో దిరుగుచున్న ఆతని ముఖము కూడ అంతర్ధానము నొందెను. ఆ ప్రయాణమున ఆతని యనుచరులు ఎమ్. ఎమ్. రెడ్డి, దామోదర రెడ్డిగార్లునై యుండిరి.

యూరోపునకు పోక పూర్వము, యుత్తరములు వ్రాయుట యనిన ఆతనికి బరువుగా నుండుచుండెను. కాని అచ్చటికి పోయిన తరువాత నేను, చెప్పిన చొప్పున క్రమము తప్పక నాకు ఉర్దులోను

తల్లికి తెనుగులోను, పినతండ్రులగు కే. ఆర్. రెడ్డి, ఆర్. ఆర్ రెడ్డిగార్లకు ఇంగ్లీషులోను వ్రాయుచుండువాడు. ఈ జాబులలో అతడు ప్రకటించుచు వచ్చిన భావములు చాల ఉత్కృష్టములుగను సవిమర్శములునై యుండెను. అట్టి ఉత్తరములలోని కొన్ని ఉద్ధృత భాగములు దీనిలో ప్రకటించ యత్నించెదను.

ఇంగ్లాండు వెళ్లిన తరువాత అతడు ప్రయత్నించి బ్రిస్టలు విశ్వవిద్యాలయములో ప్రవేశము గాంచెను.

## నిర్మాణ కౌశల్యము

ఈ కాలమున, అతడొక యంత్రమును నిర్మించెననియు దాని నొక మోటారు బైసికలుకు అమర్చిపెట్టి, చీలనొత్తిన యెడల ఆ బైసికలును అచటినుండి కదలించుటకు వీలుండదనియు మరల యజమానుడు వచ్చి చీలను విప్పినగాని కదలజాలదనియు, అతనియొక యుత్తరమువలన నాకు తెలిసెను. ఈ యంత్రమొక వ్యాపార సంఘమున కియ్యగా దానికి ప్రతిఫలముగా నాలుగు పౌనులును అట్టి యంత్రమును బహుమానముగా నిచ్చిరట. దీని విషయములో, నేను "అప్రకారము చేయక నీవే దానిని పేటెంటు చేయించి యుండిన పక్షమున చాల బాగుగా నుండెడిది కదా." అని వ్రాసితిని. "అది సాధారణమైన పనిముట్టు కనుక నేను దానిని పేటెంటు చేయించలేదు. నేనింతకంటె గొప్ప వానిని నిర్మించెదను. అప్పుడు వానిని పేటెంటు చేయించుట లాభ ప్రదముగా నుండు"నని అతడు నాకు జవాబు వ్రాసెను.

ఇప్పుడు ట్రాఫిక్ ఇండికేటర్లు కానవచ్చుచున్నవి కదా. ఇవి విక్రయమునకు పూర్వమే వీనిని నిర్మించ వయునని అతని కోరిక యుండెను. అతనికి గల ఇట్టి భావము

లకు నేను నవ్వు చుండువాడను. కాని ఇంగ్లాండుకు పోయిన తరువాత అతడు అట్టియంత్రమునుకనిపెట్టెను. అయినను దానిని రిజిస్టరు చేయుటకు ఒకటి రెండు దినములు ముందు, ఇంకొకరివలన నది నిర్మింపబడి రిజిస్టరు అయి యుండెను. అలసదనము వలన తన డిజైను రిజిస్టరు కాజాలక పోయెనని ఆతడు చాల చింతిల్లెను.

అతడు ఒక "ఎన్సైక్లో పీడియా" (విజ్ఞాన కోశమును) కొనెను. "ఈకోశము వలన మీరేమి నేర్చుకొంటిరి" అనికంపినీవారు అతనిని ప్రశ్నించిరి. అందునకు ప్రత్యుత్తరముగా నొక వ్యాసము వ్రాసి పంప కంపినీవా రెంతయు సంతసించి దానిని పుస్తకములో నచ్చొత్తించి, నూరు నాలుగు పౌనుల వెలగల నాలుగు సంపుటములను బహుమానముగా అతని కంపిరి. ఆ వ్యాసములో నేయే యంశములు వివరింపబడి యుండెనో, ఏ పుస్తకములో నావ్యాసము ప్రకటిత మయ్యెనో నాకు బాగుగ తెలియనందునకు చింతిల్లు చున్నాను. ఆ వ్యాసము ఎచ్చటనేని లభించిన యెడల దానిని ప్రకటింతును.

ఆతడు బసచేసి యుండిన యింటిలో ఒక నాటిరాత్రి దొంగ యొకడు బొగ్గుల గదిలో ప్రవేశించెను. జనార్దనుడు మంట చేయుటకు ఆగదిలోనికి వెళ్లియుండెను. ఉత్తకాళ్లతో నుండియు అతడు దొంగను వెనుకనుండి పట్టుకొని కేకవేసెనట. కాని ఎవరును రానందున దొంగ తప్పించుకొని పారిపోయెనట.

## పరీక్షలో నుత్తీర్ణుడగుట

వరుసగా మూడు సంవత్సరములు చదివిన తరువాత ఎలక్ట్రికల్ ఇంజనీరింగు పరీక్షలో కృతార్థుడయ్యెనను వార్త ౧౯౦౭ జూలై

నాడు కేబిలుద్వారా తెలియ వచ్చెను. ఈ వార్తకు సంతోషించితిమి. అతని ప్రొఫెసరులందరును చాల దయతో నుండిరనియు ఎంతో ప్రేమించు చుండిరనియు ఉత్తరముల వలన దెలియవచ్చెను. మూడవ సంవత్సరపు చదువులో, అతనికి పని నేర్పుటకు కొన్ని వ్యాపార సంఘములకు వారు సిఫారసు చేసిరి. ఆసంఘముల యజమానులు అతనిని కొంతకాలము అప్రంటిసుగా పనిచేసి ఉత్తీర్ణుడైన తరువాత తీసికొందుమని చెప్పిరి. అనేకములగు ఇతర సంఘములును అతనిని పనిలోనికి తీసికొనుటకు సంసిద్ధములై యుండెను. కాని మొదట నొకసంఘముతో వాగ్దానము చేసి యుండినందున క్రొత్తవానిలో చేర్చుట కొప్పుకొనలేదు. అతడు ఆమొదటి సంఘమువారిని విచారించగా, తత్కాలమున నచ్చట చోటులేదని చెప్పినందున చాల కలతజెంది తుదకు జర్మనీకి బోవ నిశ్చయించుకొనెను.

## జర్మనీలో ప్రాక్టికల్ విద్య

పైనచెప్పిన విధమున ప్రాక్టికల్ విద్య నభ్యసించుటకు అతడు జర్మనీ దేశమునకు పోయెను. అచ్చటనే అతడు చనిపోవుట సంభవించెను. జర్మనీదేశమునకై వెడలునప్పుడు అతడు తన "ఎన్సైక్లో పీడియా" సంపుటములను పినతండ్రియగు రంగారెడ్డిగారికి పంపుచు వానిని వసతిగృహమునకు బహుమానముగా నిచ్చుటకు వారిని కోరెను. ఇంగ్లాండులోనున్న ఇతర రెడ్డి విద్యార్థులును చందాల వలన ద్రవ్యము వసూలుచేసి పుస్తకములగొని వసతి గృహమునకు పంపియుండిరి. అతడు తన కర్తవ్యమును కొంత నెరవేర్చెను.

జర్మనీదేశములో, ౧౯౨౬ సం. ఏప్రిలువరకు అతడు ఒక చిన్న కర్మాగారములో పనిచేసిన తరువాత ఎలెక్ట్రికు వస్తువులను

పనిముట్లను నిర్మించునట్టి సీమెన్సుకంపెనీవద్దనొక సంవత్సరపు కరారు మీాద పనిలో ప్రవేశించెను. ఈ కర్మాగారములో ప్రతిదినము లక్షమంది పనిచేయుదురు. పెద్దవియు, చిన్నవియునగు అన్ని వస్తువులను నిర్మించుటను అతడు నేర్చుకొనెను. ఒక సంవత్సరము పూర్తిఆయిన తరువాత, ౧౯౨౭ సం. లో ఆ కర్మాగారము వారు అతనికి చాల మంచి సర్టిఫికేటు యిచ్చిరి. అటుపిమ్మట మరి రెండు చిన్న కర్మాగారములలో చేరెను. వీనిలో మొదటివాని కంటె చిన్న వస్తువులు తయారుచేయుచుండిరి.

౧౯౨౭ సం. సెప్టంబరు నెలలో మధుసూదను, జగన్మోహనుగార్లు హిందూదేశమునకు తిరిగివచ్చుచు అతనిని చూడబోయిరి. అతడు ఉదయమున కార్యభార నిమగ్నుడై ౭ గంటలకు కర్మాగారమునకు బోయి సాయంత్రము ౬ గంటకు యింటికి రాగోరు చుండువాడనియు, వచ్చినతరువాత మరేపనికిని పక్కరకు రాకుండునంత అలసి యుండువాడనియు వారు వ్రాసిరి. అతనికి పనినేర్చుకొనుట తప్ప మరేపనియు లేదనియు, అతడు కాలమును ఏమాత్రము వృథపుచ్చుట లేదనియు, ఇంటికివచ్చిన తరువాత ఆ వృత్తికి సంబంధించిన పుస్తకములు చదువుటయందును అట్టి విషయములం దభిరుచి కలవారితో వాదప్రవాదములు సలుపుట యందును కాలమంతయు గడపుచుండుననియు నాకు ఇతరులవలన తెలిసినది. ఏయేకర్మాగారములలో పనిచేసియుండెనో, వాని యజమానులు అతనికి మంచి సర్టిఫికేట్లు ఇచ్చిరి.

## ఇతర కార్యములు

కార్యనిమగ్నత పైనచెప్పబడినంత హెచ్చుగా నుండినను, అతడు "ఇండియన్ అసోసియేషను" అను సంఘమునకు కార్య

దర్శిగా నుండెను. ఇండియానుండి జర్మనీకిపోవు మహాపురుషు లందర కును స్వాగత మిచ్చుటను! అతడు తనవిధిగా తలంచుచుండెను.

రాజానాయని వేంకటరంగారెడ్డి గారు ఇంగ్లాడునుండి జర్మనీకి బోవునపుడు జనార్దనరెడ్డి నాకీప్రకారము వ్రాసెను "రాజాగారు త్వరలోనే ఇచ్చటికి రానున్నారు. మీకును వారికిని మనస్తాపము లున్నను నేనుదానిని ముఖ్యముగా తలచను. ఒకరు మరియొకరిని బాహాటముగా కలిసినట్లే నేనువారిని కలుసుకొనెదను. దయచేసినను క్షమింపుడు." "నీయభిప్రాయములకు నేను సంతోషించుచున్నాను. వ్యవహార విషయములో కలిగిన మనస్తాపములను వ్యక్తి విషయక సంబంధములలో కల్పించుకొనుట నాస్వభావము కాదు." అనినేను జవాబు వ్రాసితిని. జనార్దనుని మరణవార్త వినిన తరువాత రాజా గారు వెంటనే మాయింటికి వచ్చి ఈవిషయమున తమకుకలిగిన దుఃఖమును జనార్దనుని ఉత్తమ వర్తనమును గూర్చియు ఎంతయో మాటలాడిరి.

ఇంగ్లాడులోను జర్మనీలోను ఉండిన కాలములో అతడు పత్రికలకు వ్యాసములు వ్రాయుచుండువాడు, అట్టివానిలో నాకు దొరకిన యొక దానిని; నేనీ క్రింద పొందుపరచెదను. అతడు ఉపన్యాసములు చేయుచుండెడువాడనికూడ నాకు తెలసినది తనవృత్తి సంబంధముగ వృత్తితోపాటు రాజ్యాంగ విషయములలో కూడ కృషిచేసెనని వింటిని. ఇది ఎంతవరకు నిజమో నేను చెప్పజాలను.

### మాతృదేశము విషయమున సానుభూతి.

తనమాతృదేశము విజ్ఞానవంతమై యభివృద్ధి నొందవలయు ననియు దారిద్ర్యము నశించవలయుననియు పేదలకు తోడ్పడ వలె

ననియు, నిమ్న జాతులవారి యెడ ఆదరము చూపవలయుననియు వర్తక పరిశ్రమలను ప్రోత్సహించవలయుననియు అతని కోరికయై యుండినట్లు ఆయన పినతండ్రి రంగారెడ్డిగారికి వ్రాసిన యుత్తరము లవలన దెలియుచున్నది. ఇంగ్లాండులో ట్రైనింగు పొందుచుండిన డాక్టరు పుల్లారెడ్డి గారితో అతడు తాను హిందూదేశమునకు మరలివచ్చిన తరువాత పేదబాలురకు చదువుచెప్పించెదనని సర్వదా చెప్పుచుండినట్లు జగన్మోహనుడు వ్రాసిన యొకయుత్తరము వలన జనార్దనుని మరణానంతరము తెలియవచ్చెను. హైదరాబాదులో స్థాపింపబడినగాజుకర్మాగారము(Glass factory)ఎట్లుపనిచేయుచు న్నదో తెలుపుడని తరుచుగానాకువ్రాయుచుండువాడు. ఆకర్మాగా రమునకు సహాయము చేయవలసిన దనియు దాని షేర్లు కొన వలసినదనియు నాకు వ్రాసెను. ఒక కర్మాగారము కొరకు రాతిసిబొగ్గు, నీరు, రైలుకల స్థలము వెదికియుంచ వలసినదని నన్ను కోరియుండెను హిందూదేశములో రాగి ఇత్తడి వస్తువులను నిర్మించు కర్మాగారము లెన్నియున్నవో తెలిసికొనుడని నాకు వ్రాసియుండెను. వానిని గూర్చిన నివేదికలు దొరికినచో పంపుమని కోరినందున నేను సంపాదించి దొరకినంతవరకు పంపితిని. వడ్లపని చేయుకోరికగల బాలుడున్నచో అట్టి వ్యవహారమొకటి శానాపం భింతుననియు,మనరాష్ట్రములో అడవులు విశేషముగాగలవు కనుక ఈపని వృద్ధిచెంద గలదనియు, అట్టిబాలుని తనవద్ది కంపవలసిన దనియు, అతనిని కర్మాగారములోప్రవేశపెట్టించెదననియు వ్రాసెను. రెండు సంవత్సరములక్రింద నొకయుత్తరము బహుశః మే నెలలో కొత్వాలు గారికి వ్రాసెను. ఆయుత్తరము ప్రాయశఃనాద్వారా పంప

బడినది వ్యవసాయ విద్య నేర్పుటగాని ట్రైనింగు ఇచ్చుటగాని మన దేశములో చాలతక్కువగా నున్నదనియు, ఒకరిద్దరు బాలురను ఈ విద్యయందుతయారుచేసినచో చాల బాగుగా నుండుననియు కొత్వాలుగారు నెలకు రు౧౦౦ల చందాప్రోగుచేయు పక్షమునజర్మనీ లోనాకు దొరకుచున్న అలవెన్సులోనుండి నెలకు రు ౫౦లు మిగిల్చి ఈ కార్యమునకై చందాయిత్తుననియు, ఆగస్టు నెల వరకు ఈవా గ్దానమునిలుచుననియు వ్రాసియుండెను. వసతిగృహాధికారుల వలన ఎట్లయిన నెలకు రు ౧౦౦ లచందా ఈ కార్యమునకై జమచేయుట అతని యుద్దేశమై యుండెను. ఈ కార్యమునకై తన ఖర్చు లలో నెలకు రూ ౫౦ లు తగ్గించుకొనదలచి యుండెను. దీనిని బట్టి తన భావముల యౌన్నత్యమును, శ్లాఘనీయత్వమును వెల్లడి కాగ లదు. ఇట్టి యాదర్శములుగల బాలుడు జీవించి మాతృదేశము నకు, స్వజాతికిని సేవచేసి కీర్తి నార్జించుట ఈశ్వరున కిష్టము లేక పోయెను. అది మా దురదృష్టము. ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు. మన మాతని నిందింప జాలము. మనము తాలిమి వహించ వలసిన వారము. జనార్దనుడు వసతిగృహామునకు ఒక ఎలెక్ట్రికు గడియార మును పంపి, ప్రధాన కార్యదర్శియగు కొత్వాలుగారికిట్లు వ్రాసెను. "ఇది కాలము చూపుటకు మాత్రమే యుద్దేశింప బడలేదు. బాలురకు కాలముయొక్క విలువ తెలిపి వేళకు కర్తవ్యముల నెర వేర్ప ప్రోత్సహించుటకై యుద్దేశింపబడినది.

బాలురకు జ్ఞానముకల్గుటకై విద్యావిషయకములగు ఫిల్ము లను చూపుటకు ఒక సినిమాను కూడ ఆతడు వసతిగృహామునకు పంపియుండెను,

## వివాహమును గూర్చిన భావములు

ఒకటిరెండుమారులు పినతండ్రి రంగారెడ్డిగారు జనార్దనుని వివాహ విషయములో మాటలాడించెను. మానవుని యుత్పత్తికిని ఉనికికిని మూలమగు ఉద్దేశము వివాహము కాదని అతడు జవాబు చెప్పెను. చిన్నతనమున వివాహము కాగూడదని అతని యభిప్రాయము. మానవుడు విద్యాభ్యాసము పూర్తి చేసికొని వివాహము అవసరముగా నుండినపక్షమున చేసికొను టను గూర్చి ఆలోచించవలయునని అతని యభిప్రాయము. వివాహములలో జరుగుచుండు కర్మకాండయును, లాంఛనములును, అతని కయిష్టములుగా నుండెను. అతడు హిందూదేశమునకు మరలివచ్చి జీవించియుండినచో వివాహము చేసుకొనుటకు సులభముగా అంగీకరించి యుండడు.

ప్రాక్టికల్ విద్యను ఆర్జించెను. కాని వర్తక వ్యాపారముపైన అతనికి గాఢమగు కోరికయుండెను. తన ద్రవ్య వ్యయముతో కాక, ఇతరుల మూలధనముతో అనుభవము నార్జించదలచెను. కొన్ని మాసములవరకతడు ఏదోకర్మాగారములో పనిచేయుచు వర్తక వ్యాపారమునడు పదలచెను. అతడు 'సీమెన్' కంపెనీలో ప్రయత్నింపగా వారతనిని బొంబాయి రాజధానికి తమ ఏజంటుగా ఏర్పరచి అతనితో నెలకు ౧౫౦ మార్కుల వేతనముపైన పని తీసికొన నారంభించిరి. "వేతనము నెలకా వారమునకా, అని నేను వ్రాయగా, అతడు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను.: "నాకంటె యెక్కువ యోగ్యతకలవారు నాకంటె తక్కువ వేతనముపైన నున్నారు. నాకు ఆరంభముననే ఇంత

జీతము ఎందువలన నిచ్చుచున్నారాయని నాకే ఆశ్చర్యముగా నున్నది." అని ప్రత్యుత్తరము వ్రాసెను. ఈ యుద్యోగమైన తర్వాత "నాకు ప్రతిఫలము దొరకుచున్నది కనుక నాకు పంపుచుండిన ధనమును తగ్గించవచ్చును." అని ఉత్తరము వచ్చెను. "నీ యుత్తరము వచ్చువరకే నాల్గు నెలల ద్రవ్యము పంపియుంటిని. కనుక ఆపైకము ఖర్చుచేసికొనవచ్చును. ముందు ఎంతకావలెనో అంతే వ్రాసి తెప్పించుకొనవచ్చును" అని వ్రాసితిని. నేను పంపిన ద్రవ్యము నెలకు ౨౫ పౌనుల చొప్పున జనవరి మాసాంతము వరకు వ్యయమై యుండవచ్చును. అతని నిర్యాణముకూడ జనవరి మాసాంతముననే సంభవించెను. జగన్మోహను, మధుసూదనులు వ్రాసిన ఉత్తరములవల్లను రంగారెడ్డిగారికి వ్రాసిన మరియొక ఉత్తరమువలనను, ముగ్గురిని యూరోపునకు పంపుటవలన నాకు వ్యయభారము అధికమైనదని అతడు తలచుచుండినట్లు నాకు తరువాత తెలిసెను. అతడు జగన్మోహనునితో "జగన్మోహన్, చూడుము, మనము ముగ్గురము యూరోపులో నున్నాము, నాయనకు వ్యయ భారము ఎక్కువగా నున్నది. కనుక శ్రద్ధగా చదువుకొనుము" అని చెప్పుచుండువాడట. తుదకు 'బర్గ్మన్' కంపెనీవారు, అతనిని నెలకు రు ౨౦౦ ల జీతముమీద విక్రయములపైన నూటికి రెండు చొప్పున కమీషను యిచ్చు పద్ధతితో బొంబాయి ప్రెసిడెన్సికి తమ ఏజెంటుగా ఏర్పరచిరి. బొంబాయిలో నొక కంపనీ ఏర్పడుచున్నదనియు, 'బరగ్మను' కంపనీవారి ఏజన్సీ తీసికొన గోరితిననియు, అతడు నాకు వ్రాసెను. తమ ప్రతినిధులలో నొకరు ఇచ్చట ఉండవలయునను నియమమునుకూడ కంపెనీవారు ఏర్పరచిరి.

“వేతనము కొద్దిగానున్నది” అని నేను వ్రాయగా హిందూ దేశములో ఉద్యోగ మిచ్చుటయె కష్టమనియు, ఆ జీతము గొప్ప దేయనియు, మూడు సంవత్సరములు పనిచేయుటకు మాత్ర మొప్పుకొంటిననియు అంతకంటె ఎక్కువ పనిచేయ జాలననియు జవాబు వ్రాసెను.

## మరణము.

౧౯౨౯ సం. మార్చి మాసాంతమున హిందూదేశమునకు రావలయునని అతడు తలచియుండెను. సన్నాహములన్నియు చేసికొనెను. “కొన్ని మంచిపుస్తకముల కొనవలసియున్నది. ద్రవ్యము పంపు” డని నాకు వ్రాయగా, నూరు పౌనులు పంపితిని. “నేను తుర్కీ, అమెరికా, జపాను దేశములను మార్గమధ్యమున చూడ దలచినాను, కాని వ్యయము లెక్కువయగును. బొంబాయి ఏజన్సీ విషయమున పరిష్కారముకాలేదు. అచ్చటికి వచ్చిన తర్వాత ఒక నిమిషమైనను చేతులు ముడుచుకొని కూర్చుండజాలను. కనుక నాకొరకు పని సంపాదించియుంచుము” అని వ్రాయగా, నేనిట్లు ప్రత్యుత్తరము వ్రాసితిని. “వ్యయములకు జంకవలదు. ఆ దేశములన్నియు చూచి, రంగూనుకూడ పోయిరమ్ము. ఎంత పైకము కావలెనో తెలుపవలసినది. పని విషయములో నీవు బాధపడవలదు. బెంగుళూరులో ఉన్నీ మిల్లులున్నవి. అచ్చట నీవు ఏజంటుగా పనిచేయ వచ్చును. లేదా హైడ్రో ఎలక్ట్రిక్కులో నీయిష్టమువచ్చిన పద్ధతిన పనిచేయ వచ్చును. ఈయుత్తరము నేను ఏదినమున వ్రాసితినో, ఆ నాటిసాయంత్రముననే నాప్రియ పుత్రుడు పరలోకగామియయ్యెను. ఇట్టిది జరుగునని ఎవరనుకొనిరి? అతడు జీవించి యుండిన పక్షమున నా యుత్తరమును చూచి యెంతో సంతోషించి యుండును. చని

పోవుటకు సుమారు నెల దినములకు ముందు అతడు మధుసూదను నకు ఇంజనీరింగు పరికరములు బహుమానముగా పంపియుండెను. ౧౧౦ పౌనులకంటె ఎక్కువ వెలగల యొక పనిముట్టును అన్నయ్య నాకు పంపినాడు. ఇంతటి విశాల హృదయముగల సోదరుడున్నం దునకు నేను గర్వించుచున్నాను" అని మధుసూదనుడు నాకు వ్రాసియుండెను. అక్కటా? తనసోదరులను ప్రోత్సహించుటకుగాను గర్వపడదగిన వారియన్నను ఈశ్వరుడీలోకములో నుంచకపోయెను.

## మరణకారణము

అక్టోబరు మాసారంభమునుండియు అతడు తన శారీరిక శక్తిని పెంపొందించుటకై ప్రయత్నించు చుండెనట. ఈ యుద్దే శము దృష్టిలో నుంచుకొని ముష్టి యుద్ధము నభ్యసింప మొదలు పెట్టెను. ప్రతిదినము పరుగెత్తుటవలన దేహపరిశ్రమము నలవరుచు కొనెను. ఇవియే అతని యవసానమునకు సన్నాహములుగా పరిణ మించినవి, ౩౦ వ జనవరినాడు ముష్టి యుద్ధము ఏర్పడియుండెను. ఆనాడు తన క్షేమవార్త దెలుపుచు నాకొక యుత్తరమువ్రాసి పోస్టులోవేసి సాయంత్రము ఆరు గంటలవేళ బసకు వచ్చెను. తన మిత్రుడగు మెహదీఅలీ మిర్జాగారిని వెంటతీసికొని ముష్టి యుద్ధము నకు పోయెను. మొదటి పోటీలో అతడు పడిపోయెను. లేచి మరల పోరాడెను. ప్రతిపక్షి అతని ఫాలభాగమున గొట్టగా వెల్లకిల బడెను. కపాలము పగిలెను. రక్తనాళమొకటి తెగెను. (అప్పుడు రాత్రి ౮ గంటలవేళ) తొమ్మిది గంటలవరకు ఆసుపత్రికి తీసికొని పోయి చికిత్సచేసిరి. కాని మరల అతనికి తెలివిరాలేదు. రాత్రి రెండున్నర గంటలవేళ ఆతడు మమ్మందరిని దుఃఖసముద్రములో ముంచి పరలోకమున కేగెను.

ఆతని స్మారక చిహ్నములు ఇప్పుడు నావద్ద రెండున్నవి. ఒకటి టైపురైటరు; రెండవది బట్టల బీరువా (Dressing case) దీనిని చిన్నసైజులో అతడు బ్రిస్టలునగరమున ప్రత్యేకముగా చేయించి యమ్. యమ్. రెడ్డిగారి ద్వారా ౧౯౩౭లో పంపియుండెను. ఈ రెంటిని నే నిప్పుడు వాడుకొనుచున్నాను. ఆతని రెండు స్మరణ చిహ్నములను వాడుకొన గల్గినందునకు నే నీశ్వరునకు ధన్యవాదములు చేయుచున్నాను.

పింగిలి వేంకటరామా రెడ్డి,
దేశముఖు.



# మధ్య యూరోపా హిందూస్థాన సంఘము



శ్రీ॥ శే॥ పి. జనార్దనరెడ్డిగారి జీవిత సంగ్రహము



శ్రీ॥ శే॥ పింగిలి జనార్దనరెడ్డిగారు దక్షిణ హైద్రాబాదులో
౧౯౦౮ వ సంవత్సరమున జన్మించెను. హైద్రాబాదు నగరములో
నతడు ప్రాథమిక విద్యనభ్యసించిస్కూలు ఫైనల్ పరీక్షలో కృతా
ర్థుడైన తర్వాత సీనియర్ కెంబ్రిడ్జి పరీక్షకుగూర్చా యుత్తీర్ణు డ
య్యెను. తర్వాత ఇంగ్లాండునకు వెళ్లి అచ్చట బ్రిస్టల్ విద్యాపీఠము
చేరెను. అచ్చట ఇంజనీయరింగులో బి.యస్‌సి. డిగ్రీ పొందెను. తన
చురుకుదనము చేతను విజ్ఞాన ప్రియత్వముచేతను నీ విద్యాపీఠమం
దును నితర స్థలములందును చాల తెలివి గలవాడనిపించుకొనెను.
అతని గొప్పగుణములలో నతని దేశాభిమానము దేశీయులప్రేమ
చాల ముఖ్యమైనది. అవసరసమయములలో నతడు తన దేశీయుల
పక్షమువహించి సాయపడువాడు. పైగుణ విశేషమువలన నతడు
బ్రిస్టలులో చదువుచుండిన కాలమందు సర్వజన ప్రియుడుగా
నుండెను.

నాలుగేండ్ల క్రిందట నతడు జర్మనీకివచ్చి సీమెన్ ఎలక్ట్రిక్
కంపెనీలో పనిచేర్చెను. అతడు కేవలము పుస్తకములు చదువుటచే
తృప్తిపడలేదు. అతడు తన సోదర దేశీయులకు లాభప్రదమగు పను
లను చేయుట యందాసక్తి కలిగి యుండెను. మధ్యయూరోపుఖండ
హిందూస్థాన సంఘమున కతడు వచ్చిన వెంటనే కార్యదర్శిగా

నెన్నుకొనబడెను. అతడు కార్యవాదియగుటచే నీ గౌరవ స్థానము నొప్పుకొనెను. అతడు సీమెన్సు ఎలక్ట్రిక్కు కంపెనీలో పని నేర్చుకొనుచుండెను. ఈ సంఘముయొక్క యుపయోగమును విశాలపఱచెను. కాన తనకాలములో విశేషభాగము దాని నుపయోగించెను. అతనికాలములో సంఘమునకు నూతన జీవకళయు నూతనోత్సాహమును జేకూరెను. అతని పరిశ్రమా ఫలితముగా బర్లినులోను తదితరస్థలములందును నుండు హైందవులు యుద్యమములో చాల శ్రద్ధవహింప మొదలిడిరి. ఈసంఘమునకు వ్యతిరేకముగా నాచరించువారికి నీతిబోధచేసి యట్లుచేయుటను మాన్పుచుండెను. ఇంతేకాక సంఘమునకు ఇండియానుండి నానా భాగములందు వెలువడువార్తా పత్రికలను, నితరదేశ పత్రికలను తెప్పింప మొదలిడెను.

తనవిద్యను, పనినేర్చుకొనుటను సీమెను కంపెనీలో పూర్తిచేసిన తర్వాత నతడు బర్గుమన్ ఎలక్ట్రికల్ కంపెనీలో విదేశశాఖలో ఇంజనీయరుగా చేరెను. అతనితో నచ్చట పరిచితులైన వారందఱును నతని ప్రేమించి గౌరవించుచుండిరి. అతనిని సైకంపెనీ వారు ఇండియాలో తమ ప్రతినిధిగా నేర్పాటు చేయనుండిరి. బర్గుమన్‌కు అతనివలన చాలసహాయము పొందు నాశయుండెను. ఏలన అతడు నిజమగు వ్యాపార లక్షణము తెలిసిన వాడు. అతడువ్యాపారమును సాగించుటలో చాల దక్షుడుగా నుండెను.

హిందూస్థాన సంఘ పక్షమున సమావేశ పఱుపబడిన నొకసభలోనతడు „రేడియో"ను గుఱించి చాల యాకర్షణీయమగునుపన్యాస మిచ్చెను. ఆవిషయమై యాతడు పరిపూర్ణ విజ్ఞానమును సంపాదించి నందున నతని విజ్ఞానమునకు సభ్యులందఱును నాశ్చర్య

పడిరి. అతడు ముందుముందు ఇండియాలో నుపయోగించుటకై తాను చూచినట్టియో లేక తాను పనినేర్చినట్టియో యంత్రాలయముల నుండి యంత్ర శాస్త్రముల సంబంధ విషయములను సమకూర్చుచుండెడి వాడని నతని పరిచయము వలన మాకు బాగుగా తెలియును. అప్పుడప్పుడతడు ఇండియా సంబంధమగు సర్వ విషయములను గురించి వ్రాయుచుండెను. ఆక్సుఫర్డులో ప్రకటితమగు భారత పత్రికలో ౧౯౨౭ లో నతడు "౧౭వ శతాబ్దములోని హైద్రాబాదు" అనువ్యాసమును వ్రాసెను. ఆవ్యాసము చదివినవారందఱు వ్యాసకర్తను జ్ఞాపకము పెట్టుకొని యుందురు. ఈ సంఘముయొక్క కార్యదర్శిగా నతడు రెండు సంవత్సరముల కాలము పని చేసెను. తర్వాత కార్యబాహుళ్యముచేతను స్వదేశమునకు త్వరలోపోవుటకు నిశ్చయించుకొని యుండిన వాడగుటచేతను నాపనిని మానుకొనెను.

అత డనేకాభీష్టములతోనుండెను. ఇండియాకు పోయినతర్వాత దేశమునకు దేశీయులకును సేవజేయ దలచుచుండెను. కాని యతడింతలో మృత్యువు వాతబడెను. అతడు మంచి వ్యాయామపరుడు. దానిపై చాల శ్రద్ధకలిగి యుండెను. అతడు ప్రారంభదశలో నుండు వారియొక్క ముష్టియుద్ధ పోటీలో పాల్గొనెను. రెండవ గష్టులో దురదృష్ట వశమున నతనికి గడ్డముక్రింద దెబ్బదగిలెను. దానిచేత నతడు వెనుకకుబడి నెత్తికి దెబ్బతగిలి మూర్ఛితుడయ్యెను. తత్ణమే యతనిని వెస్టుమెండు ఆసుపత్రికి కొనిపోయిరి. ఇచ్చట ప్రసిద్ధినొందిన వైద్యులచికిత్స జరిగెను. కాని అతడు ౨౧ జనవరి ౧౯౩౧ నాడు ఆసుపత్రిలోనే మృతించెను.

అతని మరణవార్త మాకు ఆశ్చర్య విషాదములను గలిగించెను. అనేకులము అతడు మృతించెనని నమ్మజాలమైతిమి. ఆతని

కషాయము కలిగినప్పుడుండిన మిర్జాగారితో హాస్పిటలు అధికారి యీ విషయముచెప్పి యతనినిహాస్పటలునకు తీసికొనిపోయెను. మిర్జాగారీ విషాదవార్తను సంఘకార్యదర్శికి తెలిపెను. మేము ప్రాతఃకాలముననే వైద్యాలయమునకు పోయితిమి. టెక్నికల్ హైస్కూలుయొక్క డాక్టర్ బాయిగారు ఇతరు లనేకులును వైద్యాలయమునకు వచ్చిరి. ఈసందర్భమున తనచేతనైనంత సహాయము చేయుదునని డాక్టర్ బాయిగారు చెప్పిరి. బర్లినుకు తక్షణమే రమ్మని మేము ఇద్దరితమ్ములకు ఇంగ్లాండునకు తంతీయిచ్చితిమి. అదేప్రకారము వారు వారిబంధువు నొకరిని వెంట బెట్టుకొనివచ్చిరి. ఈసందర్భమున సంఘాధ్యక్షులగు మిర్జాగారు తనవిధిని సోదరునివలె నెరవేర్చెనని చెప్పదగియున్నది. (ఏలన యూరోపులో లభించుమిత్రులలో నీతడు (కీర్తిశేషులు) శ్రేష్ఠమైనట్టి యత్యంత ప్రీతికరుడైనట్టియు స్నేహితుడైయుండెను) ౧౯౩౭ సం॥ ఫిబ్రవరీ ౘవ తేది సోమవారమునాడు మాసంఘము వెంటనే యొక సమాశ్వాసక సభను గావించెను. కీ॥ శే॥ రెడ్డిగారి స్నేహితులలో నొక్కరును యీసభకు రానివారిలోలేరు. బర్గుమన్ ఎలెక్ట్రిక్ కార్యాలయము నుండి ప్రతినిధులు సహితమా సభకు వచ్చియుండిరి, సభ్యులలో ఇండియనులును జర్మనులును నుండిరి. బర్గుమన్ ఎలెక్ట్రికల్ కంపెనీ వారును తమ మిత్రుని వియోగమునకై తమ యత్యంత విషాదమును తెలుపుచు నొకసానుభూతి లేఖను పంపియుండిరి. ఇదేప్రకారము డాక్టర్ వ్యాగ్నర్ మున్నగువారినుండియు సానుభూతిలేఖలు సంఘమునకు పంపబడెను. ఆసమయమునకు వచ్చియుండిన స్వామీ సత్యదేవుగారు సంఘాధ్యక్షునిచే అధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. స్వామీజీగారు కీ॥ శే॥ రెడ్డిగారిని అత్యంతముగా ప్రశంసించి

మాప్రియస్నేహితుని సత్కార్యములనుండి యందరును గుణపాఠ మును గ్రహించవలయుననియు, నతడు వ్యాయామములందును, విద్యయందును తనకాలమును వినియోగించుటయేకాక తన సోదర జనుల యభివృద్ధికై యెల్లప్పుడును పాటుపడుచుండెనని యుపన్యసిం చిరి.

అధ్యక్షుల యాదేశముపై మీర్జాగారు కీ॥ శే॥ జనార్దనరెడ్డి గారి జీవితసంగ్రహమును వినిపించి రెడ్డిగారికి విపత్తుఎట్లు కలిగినది వర్ణించిచెప్పిరి. ఆసమయమున సభయంతయు వ్యసనముతోడను దుఃఖముతోడను నిండియుండెను. మీర్జాగారు తనకు కీ॥ శే॥ రెడ్డి గారెట్టి పరిచయముకలవారో వర్ణించినతర్వాత నీక్రింది తీర్మాన మును ప్రతిపాదించిరి.

“ఈసభయొక్క అత్యంత విషాదమును వెలిబుచ్చుచు నొక తంతీ కీ॥ శే॥ల తల్లిదండ్రులకు పంపవలసినది.” షేక్ గారు ఈతీర్మా నమును నుపపాదించిరి. సభ్యులందఱును నేకగ్రీవముగా తీర్మాన మంగీకరించిరి.

జే. నాయుడుగారు ఈక్రిందితీర్మానమును ప్రతిపాదించిరి.

“మధ్య యూరోపుఖండపు హిందూస్థానసంఘము యీసం ఘముయొక్క కార్యదర్శిగానుండిన పి. జే. రెడ్డిగారి విషాదకరమును వ్యసనకరమును నగు మరణమునకై వ్యసనపడుచు ఆతడీ సంస్థ కుచేసిన వివిధములగు సేవలనుగుణించి అత్యంతముగా ప్రశంసించు చున్నారు. హిందూస్థానసంఘము రెడ్డిగారి కుటుంబమునెడ వారికి

గలిగిన వియోగమునకై తమహృదయపూర్వకమగు సానుభూతిని వెల్లడించుచున్నారు"

నాయుడుగారీ తీర్మానముపై యిట్లుమాట్లాడిరి

"మనము మనకు కలిగిన స్వీయనష్టమునకు మాత్రమే మనము వ్యసనపడుటలేదు. అమూల్యుడగు నొకయువకుడు తనజీవితమును శక్తిసామర్థ్యములను తన మాతృభూమి యొక్క సేవకై సమర్పించుట కొరకు యుద్దీపితమగు కాంతుతోనుండగా నతని గోల్పోవుటి మనియు, మనకు విషాదము కలుగుచున్నది. హిందూస్థానములో యువకుల సేవ యెంత యావశ్యకమో యా దేశమునకే యెరుక."

ఈతీర్మానమును వర్మగారు బలపరచిరి. వర్మగారు ఇండియా ప్రభుత్వ నిరంకుశత్వమునకు గురియైనవారు. వారు ౧౯౧౯మి షములకుపైగా మాట్లాడిరి. రెడ్డిగారు హిందూ ముసల్మానుల యైకమత్యమునకు నిదర్శనులని చెప్పిరి. ఏలన వారు హిందువులను ముసల్మానులను తమసోదరుల వలె చూచుచుండిరి దేశపరిత్యాగియైన ఆచార్యగారు తర్వాత తీర్మానముపై మాట్లాడిరి. అతడు కొన్నిమాటలు మాట్లాడక మునుపే కన్నీరు కార్చుచు విశేషముగా మాట్లాడ లేకున్నను నీ విధమున కీ॥ శే॥ రెడ్డి గారి యెడ నతని కుండిన సత్య ప్రేమను శాంతయుత గాంభీర్యముచే చూపించెను. రెడ్డిగారెల్లప్పుడు దేశభక్తిచే ప్రజ్వలించుచుండె నని యతడు చెప్పెను. తనతో నతడు కలసినప్పుడెల్లను మృదుస్వభావముతో మాట్లాడుచు తన దేశీయులయెడ సానుభూతిని చూపించెను. తర్వాత ఫియర్‌గారు మాట్లాడి తీర్మానమును మనఃపూర్వముగా బలపరచిరి.

రెడ్డిగారు చాల ఆకర్షణీయుడగు మహాపురుషుడనియు అతనితో పరిచితులుగానివారు సతని స్నేహితులై ప్రశంసకు లగుచుండిరని వారు మాట్లాడిరి. ప్రొఫెసర్, పండిత్ తారాచంద్ రాయిగారు పై తీర్మానమును బలపఱచుచు తాను సంఘాధ్యక్షుడుగా నుండిన కాలములో కీ॥ శే॥ రెడ్డిగా రెల్లపుడు తనకు సహాయకారిగా నుండి రనియు, రెడ్డిగారు సంఘ కార్యదర్శిగా నుండిరనియు నుపన్యసించిరి. ప్రతివాడును కీ॥ శే॥ రెడ్డిగారి జీవితము నుండియు, సుగుణము నుండియు నాదర్శము గ్రహించ వలెనని చెప్పిరి. కీ॥ శే॥ లకు తన దేశసేవయే యన్నిటికన్న ప్రధానమై యుండెను. అతని సేవ వలన హిందూ దేశమునకిట్టి నష్టము నిజమగు నష్టమని విశద మగును. కాని మృత్యువు బలీయమైనది." వీరితరువాత మరికొంద రు మాట్లాడిరి. అటుపై అధ్యక్షులవారి యాజ్ఞచే షేక్ గారీ క్రింది తీర్మానమును ప్రతిపాదించిరి.

"రెడ్డి స్మారకనిధి యనుపేర కొంత మొత్తము అమూల్యమగు మిత్రుని గోల్పోయిన హిందూస్థాన సంఘ పక్షమున వసూలుచేసి యీనిధిచే సంఘము యొక్క వివిధ కార్యములను వృద్ధి పఱచ వలయును."

ఈ తీర్మానమును గుఱించి షేక్ గారిట్లు మాట్లాడిరి. "అతడు మననుండి ఆకస్మికముగా ఎడబాయు అయినందులకు మన కందఱకును చాల సంకటముగ నున్నది. అతడు జర్మనులను ఇండియనులను సమానముగా ప్రేమించెను. ఏలన యతనిదృష్టి విశాలముగను అంతర్జాతీయముగను నుండెను. ఇచ్చటనున్న వారిలో నీ నిధికి చందా వేయుటకు అనుమానించు వారొక్కరును లేరు.



గ్రత్తి

కీ॥ శే॥ రెడ్డిగారు ఈ సంఘమును మంచి ధన సంపత్తితో కూడిన దానినిగా జేసి ఈదేశమునకు ఉన్నత విద్యకై వచ్చు ఇండియా విద్యార్థులకు సహాయ పడునట్లు చేయగోరు చుండిరి. అతని వాంఛితమును మనము నెరవేర్చువారమైన మన చేతనైనంత యీనిధికి చందా వేయవలెను.

ఈ తీర్మానమును బలపఱచిన తర్వాత నేకగ్రీవముగా నామోదించిరి. ఆ స్థలముననే ౨౮౦ మార్కులు సంఘ సభ్యుల చేతను, సంఘ స్నేహితుల చేతను చందా వేయబడెను. అధ్యక్షుడు కొన్ని యుపసంహార వాక్యములను మాట్లాడెను. సభ ముగియుటకు పూర్వము అందరును కీ॥ శే॥ ల యెడ తమ గౌరవ మును ప్రకటించుచు కొన్ని నిముషములు నిలిచి యుండిరి.

అంత్యక్రియలు ౧౯౩౯ ఫిబ్రవరి ౬ వ తేదీనాడు విల్మర్స్ డార్ఫు శ్మశానవాటికలో జరుప బడెను. బర్గుమన్ ఎలెక్ట్రికల్ వర్కు పక్షమునను, టెక్నికల్ హైస్కూలు పక్షమునను, హ్యాండిల్ హాక్షూల్ పక్షమునను వివిధ విద్యార్థి సంస్థల పక్షమునుండియు ప్రతినిధులు వచ్చియుండిరి. సమావేశము చాల గొప్పదిగా నుండెను. ఏలన అనేక జర్మనులు, జర్మని స్త్రీలును వచ్చియుండిరి. వచ్చిన వారిలో ముఖ్యులు డా॥ బాయిగారును టెక్నికల్ హైస్కూలు యొక్క శరీర వ్యాయామ శాఖలోని నతని స్నేహితులును ప్రొఫెసర్ రోసెంథాలుగారును, ప్రొఫెసర్ రాయి గారును, మినిజీగారును, సామ్రాజ్యతత్వ ప్రతిపక్ష సంఘ ప్రతి నిధులును, రెడ్డిగారి సోదరులును నై యుండిరి.

అంత్య క్రియలు గానముతో ప్రారంభమయ్యెను. తర్వాత ప్రొ॥ రాయిగారు హిందూ శాస్త్రములనుండి శ్లోకముల నుదహరించి

చుచు నొక మతోపన్యాస మొసగిరి. దీని తర్వాత వారొక చిన్న యుపన్యాస మొసగిరి. తర్వాత టెక్నికల్ హైస్కూలు పక్షమున డా॥ బాయిగారు తాము కీ॥ శే॥ రెడ్డిగారి కుటుంబముతో సానుభూతి తెలుపుచు వారి పరితాపమందు పాల్గొను చున్నామని మాట్లాడిరి.

గానముతో అంత్యక్రియలు పూర్తియయ్యెను.

—ఏ. ఏ. షేక్

గౌ॥ కార్యదర్శి.



## సానుభూతి లేఖలు.

బర్లిన్. ౫ ఫిబ్రవరి ౧౯౩౯.

"అతడు అందరికిని ప్రియుడై యుండినందున నీవిషాదవార్తను వినిన వారందఱును అత్యంత విషాదయుక్తులైరి, బర్లిన్ నగరములో ఏ హిందూస్థానీ సంఘమునకు నతడు కార్యదర్శిగను మార్గదర్శిగను నుండెనో యా సంఘమువారొక సానుభూతి సభను జరిపిరి. నాకు సంభవించిన యీ దురదృష్ట సమయమున నాకత్యంతముగా సాయపడిన వారందఱు వారి నిజమగు స్నేహితులని తెలిసినది ఇట్టి స్నేహితులు సుమారు రెండుమూడువందల జర్మనులును ఇండియనులునై యుందురు. ప్రతివారును అతని పరిచితులు లేక స్నేహితులు. మా అన్న విషయమై నేను విశేషముగా వ్రాయుట అనవసరము. అతని చర్యలే యతని గొప్పశీలనమును ప్రకటించు చున్నవి

అతడు తన యవ్వనకాలములో ౭ సంవత్సరములు యూరోపులో గడపినను ఒకతూరి యైనను స్వదేశమునకు వచ్చి మిమ్ముగాని, తల్లిగారినిగాని, చూడక యిక రెండు మాసములో మిమ్ము కలుసుకొను సమయములో చనిపోవుట అత్యంతవిషాద జనకమైన విషయము."

మధుసూదన్

జాగో స్ట్రీట్ 36 II. బర్లిన్ ౭-౨-౩౯

నిజమైన ఉపజ్ఞగలిగి, తన విజయమున కడ్డుపడిన కష్టముల నన్నిటిని సాధించి, యంతగా శ్రమించినట్టి వానిని గోలుపోవుటచే మనకు భయంకర రూపమగు విపత్తు సంభవించినది. ఆతనికి స్థిరాభి

ప్రాయములు ఉన్నతాదర్శ ముండుటచే ఇండియను లందఱును నతని చాల మెచ్చుకొనుచుండిరి. మొన్నటి తడవనే నతని దగ్గర యుండినప్పుడు తన స్నేహితులతో మాట్లాడినపుడెల్లను ఇండియాను వృద్ధికి తెచ్చు మార్గములను తన స్నేహితులతో ముచ్చటించు చుండెను. ఒక విదేశములో నుండినట్లు భావించుకొని ఇండియను లందరును నేకస్థులై కలసి పనిచేసినట్లైన వారికి జయము చేకూరునని చెప్పుచుండెడివాడు. బర్లిన్‌లో నెవ్వరికైన కర్చుల కిబ్బంది కలిగిన నతడు సహాయము చేయుచుండెను. అనేకు లితడనిన చాల గౌరవముతో మాట్లాడుచు నతడు మహా పురుషుడని భావించెడి వారు. పుల్లారెడ్డితో నితరులతో తాను ఇండియాకు పోయిన తర్వాత బీదపిల్లలను జేర్చి వారికి విశేషముగా పరిశ్రమలందు పని నేర్పుదునని చెప్పుచుండెడివాడు.

పి. జె. రెడ్డి.

బర్గుమన్ ఎలెక్ట్రిసిటాట్సువర్కు. బర్లిన్ N 65. ౧౮ ఫిబ్రవరి ౨౯

పై వారు పంపిన జాబునుండి ఉద్ధృతములు:—

అతని యాకస్మిక మరణము మాకు చాల విషాదము కలిగించినది. మీ కుమారుడు మా కంపెనీలో కొంత కాలము నుండి పనిచేయుచుండెను. కావున అతని కార్యములను, అతనికి యుత్కృష్ట గుణములను గుఱించి మా యనుభవము బట్టి ప్రశంసించు చున్నాము.

బర్లిన్. ౮ ఫిబ్రవరి ౧౯౨౯. రెమింగ్టన్.

మే మందరమును నతనిని చాల ప్రేమించుచుంటిమి. ఆతడుత్తముడు. మాకు ప్రియస్నేహితుడు. బర్లిన్‌లో నతనిని రెండు ఏండ్లుగా చూచినప్పటినుండియు నతడు మా యభిప్రాయమున మేము చూచినవారందరిలో నుత్తమ యువకుడు.

## మూడవ భాగము



## కీ॥ శే॥ జనార్ధన రెడ్డి గారి

## వ్యాసములు

# ౨౦ వ శతాబ్దము లోని హైదరాబాదు.

(భారత్ అను ఇంగ్లండులోని పత్రికయందు వ్రాసినవ్యాసము)

నానా రాష్ట్ర సమితివారు బానిసత్వమును గురించి విచారించి రిపోర్టుచేయుటకై యొక సంఘమును స్థాపించిరి. ఆ సంఘము వారు తమ నివేదికలో హైదరాబాదు నందున, తదితర స్వదేశ సంస్థానములలోను బానిసత్వ మింకను ప్రబలి యున్నదని వ్రాసి యుండిరి. ఈ విషయము తెలియనట్టి అనేక భారతీయులకును విదేశీయులకును, యీ నివేదిక ఆశ్చర్య కరముగనే యుండును. కాని నిజాం రాష్ట్రీయు లందరికిని(నేను నిజాంరాష్ట్రీయుడ నగుటచే నిజాం రాష్ట్రముగూర్చి ముఖ్యముగ చెప్పుచున్నాను) ఇదియెంతయు అవమానకరమైన, విషయము నిజాంరాష్ట్రములోని అన్ని ప్రాంతముల యందును ధనవంతులయొక్కయు, మధ్యతరగతివారలయొక్కయు ప్రతిగృహము నందును నీబానిసతనము ప్రబలి యుండుటయే గాక పోషింప బడుచు కూడనున్నది. భారతీయుల చేతనేగాని విదేశీయుల చేతనేగాని నిందింప బడకమున్నే దీనిని రూపుమాపక విదేశీయులిట్టి దురాచారములను వ్రేలుబెట్టి చూపువరకు మిన్నకుండుట విచారకరము.

ఈ సమస్యకు దోడుగ గోషా, బాల్యవివాహము, దానివలన స్త్రీలలో కలుగుచున్న విద్యావిహీనత, అస్పృశ్యత, సాంఘికులలో కలసిమెలసి యుండకుండుట, మున్నగునవి నిజాంరాష్ట్రమున

కే కాక ఇట్టి దురాచారములు మరియెచ్చట నున్నను దేశాభ్యుదయమునకు ప్రతిబంధకములుగ నున్నవి. ఇవిగాక మన మెఱుంగునట్టి ఇంకను అనేక దురాచారములు కలవు. అనగా అధికారులలో లంచగొండితనము సిఫారసులు వినుట, ఆచారములలో భేదము మన్నింపులు మున్నగునవి. కాని వీనిగూర్చి నేనేమియు చెప్పను. ఈ లోపముల బోగొట్టు సదుపాయముల చర్చించుట ప్రస్తుతము నాకు మించిన కార్యము. కావున నాకు తెలిసినంత వరకు వీనిని గుఱించి చర్చించుచు దేశాభిమానమనిన సర్వతోముఖమున మాతృదేశ మభివృద్ధిలోకి వచ్చుట యని నెఱుంగుదురుగాక యని వేడుచున్నాను. అట్లుగాక విదేశీయులు నయితము త్వరలో గుర్తెఱింగి మనకు వ్యతిరేకముగ ప్రబోధ మొనర్చుట కవకాశ మిచ్చు దురాచారములను గమనింపక, ఒప్పుకొనక, సమర్థించుటకు కూడ బూనుకొనుట దేశభక్తిగాని దేశాభిమానముగాని ప్రేమగాని కాజాలదు.

ప్రస్తుతము హైద్రాబాదు లోని బానిస తనము అమెరికా లోని బానిసతనముగూర్చి 'అంకల్ టాము కేబిన్' (Uncle Tom's cabin) అను పుస్తకములో వర్ణించినట్లు లేకున్నను ఇంకను మిక్కిలి దుస్సహమైన స్థితిలో యున్నదని యొప్పుకొనక తప్పదు. నానా రాష్ట్ర సమితి నివేదికలో సూచించినట్లు కొన్ని స్థలములలో యీ బానిసల ప్రాణములు సయితము యజమానుల స్వాధీనములో నున్నవనుట నిజమే.

అమానుష కరమును, అవినీతి కరమునునగు ఈ ఘోర దురాచారము మన సాంఘిక జీవితమునందు ఘనీభవించినదై

నేడుల్లఘింపరాని సాంప్రదాయమై మనకు కళంకము దెచ్చుచున్నది. ఇది ధనవంతులలోను, మధ్యతరగతి వారియందును, కరివిగ నలవాటులో నున్నది. వీరిలో ననేకు లవసరము వలన గాక యాచారము కొరకో హోదాకొరకో బానిసల నుంచుకొనుచున్నారు. సంపన్న గృహస్థుల యిండ్లయందెల్ల వంశపరంపరగా నా కుటుంబము నాశ్రయించుకొని వారి పోషణలో నుండు బానిసలనేకు లున్నారు. వీరికి దోడు కుటుంబము భారమగుటచే జీవయాత్ర గడపలేని బీద తలిదండ్రులు,తమ పిల్లలను, అందు ముఖ్యముగ బాలికల నమ్ముకొను చుండుట యాచారమై యున్నది. కరువు దినములలోను, కష్టకాలములందు తలిదండ్రులీరీతి తమ సంతానము నమ్ముకొనుచుండ గృహకార్య నిర్వహణమునకు సేవకులు కావలసిన యజమానులును, తమ యాడు పడుచులు కాపురమునకు బోవునపుడు వెంట నూడిగములు సేయుటకుగాను దాసీలుగా పంపుటకు సేవకురాండ్రు గావలసిన తలిదండ్రులును వారల గొనుచుందురు.

ఇట్లు కొనబడిన సేవకులందరు నింటియందు నీచకార్యములు జేయుటకే యుపయోగింప బడినను, వారెల్ల స్వాతంత్ర్యశూన్యులై మిక్కిలి హింసింపబడి హైన్యముగ జూడబడుట అసత్యము కాదు. కాని యజమానుల చిత్తవృత్తి ననుసరించి నిగ్రహానుగ్రహ పాత్రులగుట మాత్రము నిజము. ఒక కుటుంబమునందు దయతోడను, ప్రేమతోడను, పెంచబడిన ఆడబాప గూర్చి చెప్పెదను, అది తా వరించిన పురుషునితో లేచిపోగ ఆ యింటి యజమానురాలు తన కుమార్తె పోయినట్లుగ విలపించెను. కొంతకాలమునకు ఆ పురుషుడు చనిపోగ దాని కెట్టిపోవు

టకు వీలులేనందున అది తాను పూర్వమున్నవారి గృహమునకే వచ్చెను. అయింటివారు దానిని సంతోషముతో నుంచుకొనిరి. కాని అందఱును ఈ విధముగా జూచెదరని చెప్పుటకువీలులేదు.

దీనులగు యీసంఘ బహిష్కారుల జీవితమును వారికన్న ఇతరులెవరును గ్రహింపజాలరు. వారి జీవితము వారలకేగాక ఇతరులకు కూడ భారమైయున్నది. ఎట్టి హక్కుగాని రక్షణగానివారలకు లేదు. ఎంత కాలము కష్టపడి పని చేసినను ప్రతిఫలము ప్రాణధారణకత్యవసరమగు తిండి గుడ్డ తప్ప వేరేమియు బొందజాలరు అప్పుడప్పుడు నియమిత కార్యములను బాగుగ నెరవేర్చి తమయజమానురాండ్లను సంతోష పెట్టిన యెడల వారిచ్చు స్వల్ప బహుమానములను వీరు పెన్నిధిగా తలంచి సంతోష పడవలసి యుందురు. పరాధీనలగుటచే వీరలనెవ్వరు వివాహమాడరు, ఒక వేళ యెవరైన సంసిద్ధులైనను, యజమానులు తామొక బానిసను గోల్పోవుదురు గాన యభ్యంతర పెట్టెదరు. వివాహమాడకున్నను సంతానమునకు బడయుటకెట్టి యంతరాయములు లేవు. తరుచుగ వీరు బహుసంతతి గలవారై యుందురు. ఈ సంతతి యంతయు తమయజమానులకు తిరిగి బానిసలు కావలసినదే. ఈవిధముగ ప్రతిసంపన్న గృహస్థుని యింటి యందును తండోపతండములుగ బానిసకుటుంబము లుండుట మనము చూచుచున్నాము. యోగ్యుడగు మనుజుడెవ్వడును బానిసలయొక్క యీ స్థితిని జూచి సహింపజాలడు. అట్టిచో విద్యాధికులగు గృహస్థులుకూడ తాముసాటి మానవుల స్వాతంత్ర్యము నరికట్టుచుండుట యధర్మమని యైన దలంపక బానిసల పోషించుచుండుట మిక్కిలి శోచనీయమైన విషయము. నేటివరకీసమస్యను గూర్చి ఎవ్వరును శ్రద్ధ వహించినట్లు గాని ఆలోచించినట్లు గాని కనబడదు, ఈ దురాచారమును రూపుమాపుట అసాధ్యమని యెంచిరి గాబోలు.

బానిసలుగల కుటుంబములలోనుండు వారి కెల్లరికీ దురాచారము యొక్క అనావశ్యకత బోధపడగలదు. ఏలయన ఒకటి వారితర సేవకులకన్న పనిలో నేమి నేర్పరితనములో నేమి మిక్కిలి వెనుక బడియున్నారు. ఒక పనిచేయుటయందుగాని పనితనమును సంపాదించుటయందుగాని వారి కెట్టియుత్సాహముండదు. ఎంతటి నేర్పరులైనను వారితరులవలె విశేషప్రతిఫలమును బొందజాలరు. రెండవది ప్రతికుటుంబమందును బానిసలనేకులుండుటచే పని చేయుట సాధ్యమగునంతవరకు తప్పించుకొనుచు బాధ్యత నితరులపై వేయు జూచుచుందురు. కాబట్టి సమస్తహక్కులను, బాధ్యతలను సక్రమమగు నిర్ణీత వేతనములను కలిగియున్న నేర్పరులగు కొద్దిమంది సేవకుల నుంచి జీతముల నిచ్చి నియమించుకొనుటకంటె "తిండికి తిమ్మరాజులు, పనికి పోతురాజులు" నగు యనేక బానిసకుటుంబముల బోషించుట అనవసర ధనవ్యయమునకు కారణమగుచున్నది. సమిష్టికుటుంబములోని బానిస కూతుండ్రవలన ననేక అంతఃకలహములు ప్రబలి కుటుంబ విభాగములకు కారణమై చివరకు కోర్టు కెక్క వలసిన యావశ్యకతకూడ గలుగుచున్నది. ఇట్లేవిధముగ జూచినను గృహములందు బానిసల నుంచుట కెట్టి యావశ్యకతయు గాన్పించదు.

ఇవిగాక భారతదేశమున కంతకు సామాన్యములగు దురాచారములు కొన్ని నిజాంరాష్ట్రమునందు గలవు. భారతదేశము లోని అన్ని రాజకీయపక్షముల వారును, "అంటి ఏషియాటిక్ చట్టము"ను తీవ్రముగ ప్రతిఘటించి ఆఫ్రికాదేశములోని భారతీయుల స్థితిని బాగుచేయ వేయువిధముల ప్రయత్నించుచున్నారు.

ఆ చట్టమును బాగుగ పరిశీలించిన యెడల ఆఫ్రికాలోనున్న భారతీయులస్థితి మన దేశమందలి పంచములస్థితికన్న దుస్సహము గాదని తెలియనగును. ప్రతివ్యక్తియు ఆఫ్రికాలోనున్న మన దేశీయులస్థితి బాగుపరుచుటకు ప్రయత్నించుచునుండ మనలో కొందరు మాత్రమే అస్పృశ్యతను రూపుమాపుటకై పూనుకొనుచున్నారు.

ప్రతిగ్రామమునకు వెలుపల కొన్ని పూరిగుడిసెల సముదాయము గాన్పించుచుండును. అదియే ఈ పంచమజాతి వారి నివాసస్థలము. వారికి ప్రత్యేకముగ బావులును, చిన్నదుకాణములును, ఉండును గ్రామములలోని బావిలో వారికి నీరుగొన నీయరు ఏజాతి హిందువుడైనను పంచముని తాకినయెడల గుడ్డలు విప్పి స్నానము చేయవలెను. ఇట్టివాడు మిక్కిలి మాలిన్యము కలిగిన కుక్కను తన చేతితో తట్టిన తర్వాత సయితము బహుశా నీటితో కడిగికొనుటగూడ మానివేయుచుండును. దీనిని బట్టి అతడు మనుష్యుని కుక్కకన్న నీచముగ గణించుచున్నాడని అభిప్రాయము కాదు; కాని చిరకాలమునుండి వచ్చుచున్న యీ దురాచారబంధమును త్రెంపివేయ ధైర్యము లేనివాడై దానికి దాసానుదాసుడైనాడని యర్థము.

నిజాం రాష్ట్రము లోని ప్రతి గ్రామమందలి పంచము లందరు నాలుగుగా గాని ఐదుగా గాని గుంపులుగా పటేలు లేక దేశముఖు వలన విభజింప బడుదురు. వీరు పటేలు యొక్క ఆజ్ఞలోనుండి అవసరమగు నపుడెల్ల నేయొక వైదుగురోవచ్చి వెట్టిగా పనులు జేసి పోవలెను. వీరికి చేయమని నిరాకరించుట కధికారము లేదు. చేసి

నందున ప్రతి ఫలము లేదు. ఒకజట్టు కొన్నిదినములు పని చేసిన పిమ్మటవారిబదులు మరియొకజట్టు వచ్చును. కొన్ని సంవత్సరముల క్రిందట మహా ఘనతవహించిన శ్రీ నిజాం ప్రభువుగారు ఫర్మాను ద్వారా 'బేగారి' అనుసీదురాచారమును అక్రమమైనదిగ శాసించిరి. అయినను యీ దురాచారము పూర్తిగ నడుగంటినట్లు లేదు.

క్రైస్తవ మతబోధకులు యీ అస్పృశ్యులను తమమతము లోనికి మార్చుకొని వారికి విద్యగఱిపి నప్పుడు వీరిస్థితి సంఘము నం దెక్కువ గౌరవప్రద మగుచున్నది ఎవరి నింతకుపూర్వము జంతువులకన్న నధమముగ జూచిరో అట్టివారినే తిరిగి గౌరవించు చున్నారు. మమ్ముల శాశవల దనుట కధికారము లేదు. తరువాత వీరివలన క్రైస్తవ మతబోధకులు పొందు రాజకీయోపయోగము గూర్చి నేను చర్చించను. మనలో చాలమందికి దెలిసినట్లు ఈ అస్పృశ్యత ఒక గొప్పవంచనగాని మరేమియుగాదు.

అన్నిటికన్న మిన్నయైన దురాచారము నిజాం రాష్ట్రము నందు పర్దా, లేక గోషాయను పద్ధతి. అనేకులీయాచారమునుబహి రంగముగ ఖండించినను లోలోన తామే తమస్త్రీల నీపద్ధతి నవ లంబించుటకై బలవంత పెట్టుచున్నారు. ఈ యభ్యాస మారోగ్య మున కెంతయు భంగకరము. స్త్రీల యభ్యుదయమున కెంతె మనసాంఘిక జీవనమునం దొకతుకుపరాని మచ్చ. ఈ యము. దీనిని మాన్పించుటకై ప్రయత్నములేమియు జరుగుచుండుట లేదు ఈ దురాచారము ప్రజల మనముల నెంత గాఢముగ నాటి నదిగా తెలుపుటకు పట్టణములందు మిక్కిలి కొద్ది గృహములు

మాత్రమే రెండంతస్థులు గలవై యున్నవి. ఏలయన రెండవ యంతస్థులపై నుండువారు చుట్టుపట్ల నున్న గృహములలోని జనానాను జూచెదరను భయమున నట్టిగృహముల గట్టనివ్వరు. ఒక వేళ కట్టినను, జనానాగల యింటి వైపున నున్న కిటికీల నన్నిటిని మూయించెదరు. కొంతకాలముక్రింద హైద్రాబాదునకు పైనికావసరములకై వాయు విమానముల దేగ వీనిలో గూర్చుండి ప్రయాణము జేయువారికి జనానాలు గనబడునని కొందరు ఆక్షేపించినట్లు వదంతి బయలు దేరెను. బుద్ధిమంతులు నేను పరిహాస మొనర్చుచున్నానని తలంచెదరు. కాని నేనట్లు చేయుటలేదు. వాయు విమానముల గూర్చిన సంగతి యెంతవరకు నిజమో చెప్పజాలను. కాని, నిజాం రాష్ట్రములోని అన్ని జాతులవారు సాంఘిక విషయములలో సంకుచితాభిప్రాయము కలిగి యున్నారు. అస్పృశ్యతను నమ్మువారివలె వీరుకూడ గోషాను తొలగించుటకు వ్యతిరేకులుగా నున్నను, హైద్రాబాదునం దున్నంతవరకు గోషాపద్ధతి నవలంబించుచు, బొంబాయి నగరముగాని, కలకత్తా నగరముగాని, చెన్నపట్టణముగాని బోయినచో స్వేచ్ఛతో బజారులలో (బురఖ) నాచ్ఛాదములు లేకయే తిరుగుచుందురు.

ఈ యసహ్యపు గోషా పద్ధతివలన కలిగెడు నష్టముల వివరించుట కలవిగాదు. స్త్రీలయందు మొత్తముపై విద్యశూన్యమనియే చెప్ప వచ్చును. బాల్యమున నున్నప్పు డేమినేర్చెదరో యదియే వారి పాండిత్యమునకు పరమావధి. ఈ యిరువదియవ శతాబ్దమునందు స్త్రీలెల్లెడల విద్యావతులై, తమ వాఙ్మయమును స్వీయకల్పనలచే బెంపొందించు చుండ మనదేశస్త్రీలు అంగసౌష్టవము, అజ్ఞానము, వంటచేయుట, భర్తల ప్రీతులజేయుట, యనునవియే భూషణములుగా గలిగియున్నారు.

హైద్రాబాదు నగరమునందే కాక నిజాంరాష్ట్రమంతటికిని మేలైన పాఠశాల యొకటియే గలదు. ఇందుకూడ పర్దా కలదు. అందుచే అచటికి బోవుటకు తగిన వాహన సౌకర్యములు గల ధనవంతులే తమ బాలికల నచటికిపంప శక్తిగలవారుగాని తదితరులు దాని లాభము పొందజాలరు. ఈ ధనికులు తమ బాలికలకు విద్యయే వలదను నంతటి పూర్వాచార పరాయణులుగా నున్నారు. ఇంతియగాక పాఠశాల కేగిన యెడల తమ బాలికలు బీదవారితో కలసిమెలసి తిరిగెదరను భయముగలదు.

ధనవంతులును, మధ్యతరగతి వారును, కొలది మందియే యైనను, వీరు మిక్కిలి పలుకుబడియు, అధికారమును, కలిగి యున్నారు. అందు వలన బీదబాలికల విద్యాభ్యాసమునకు ప్రోత్సాహముగాని, సౌకర్యములుగాని, యుండవు.

ఈ గోషాపద్ధతివలన మేథాశక్తి క్షీణించుటయే గాక శరీరారోగ్యము గూడ పాడగుచున్నది. హైందవ వనితలకు సహజముగ నెన్నబడు విచారగ్రస్తతకీ గోషాపద్ధతియే కారణము. తరములు గడచిన కొలది సంతతికి శరీర దార్ఢ్యత క్షీణించుటకు నిదియే కారణము. స్త్రీలు సుఖప్రసవము పొందజాలక మరణించుటకును, శిశువులు దుర్బలులై యొక వత్సరములోననే మరణించుటకును గూడ యీ దురాచారమే కారణమై యున్నది.

ఇవిగాక ఇంకనుకొన్ని దురాచారములు నిజాం రాష్ట్రము నందు గలవు. వానిలో ముఖ్యమైనది బాల్య వివాహము, వితంతువుల హీనస్థితి. గోషాపద్ధతియు, బాల్యవివాహమును, దురాచారములలో కవలపిల్లలు. ఒకదానిగూర్చి చెప్పిన విషయమే రెండవ

దాని కన్వయించును. వీనిని రూపుమాపుటకై నిజాం రాష్ట్రీయము నందెట్టి ప్రయత్నము చేయబడుటలేదు. బహిరంగముగ ఇవికూడ దని చెప్పు వారు కూడను వీనిని తమ యిండ్లయందే అమలు నందుంచు చున్నారు. బాల్యవివాహము వలనను, గోషాపద్ధతి వల నను, మనము శారీరికముగను, రాజకీయముగను, నధఃపతితుల మగు చున్నాము. ఈ రెంటిని నిర్మూలింపనిది పురోవృద్ధి కవ కాశములేదు. వీటినాచరణలో నుంచ వలెనని సిద్ధాంతరీకరించు శాస్త్రము లున్నయెడల వాటిని మనము సరకుగొన బనిలేదు, మన్నించ వలసిన అవసరము లేదు. స్వీకరించ వలసిన యావశ్య కతయు లేదు.

నిజాం రాష్ట్రము సాంఘికముగ నన్నిటి కన్న వెనుకబడి యుండుటకు మారుగ మార్గదర్శకముగ నుండ వచ్చును. ఉండ గలదు. ఉండవలెను.

---

పై వ్యాసముపై పి. కే. రెడ్డిగారి విమర్శనము

---

విషయములలో అతిశయోక్తులుమెండు. విషయనిరూపణ మందు సత్యమందు కొంతలోపమున్నది.

బహుకాలమునుండి వచ్చిన యాచారము తత్క్షణమే మార్పు చెందదు. మార్పుచెందుటకు జనులకు బోధించవలెను.

బాల్యవివాహములలో అస్పృశ్యతా విషయములలో హైద్రా బాదు వేయిరెట్లు మేలుగా నున్నది.

కరోడిగిరిలో ప్రత్యేకానుకూలములు చాలకాలము క్రింద టనే తీసివేయబడినవి.

ఈ నేరములు విదేశీయులు గుర్తించకముందే నిగ్రహింపబడినవి.

సహగమనమును మాన్పించుటకు విశేషప్రియత్నము చేసినదెవరు? దానిని నిలుపుదల చేయించినది రామమోహాన రాయలు. కాని దానివలన కీర్తి విలియంబెంటిక్ ప్రభువుకు చెందెను.

గృహదాస్యమనునది వట్టిది. హైద్రాబాదు గృహములందలి బానిసల పరిస్థితులతో సరిపోల్చిన గృహసేవయు అంకల్‌టాముకథయువట్టి బూటకములు.

హైద్రాబాదుకు సంబంధించినంతవరకు పూర్తిగఅసత్యము.

అబద్ధము.

విషయనిరూపణలేదు.

బాగుగా చూడబడి బట్టలిచ్చి శ్రద్ధతీసికొనబడుచున్నారు.

ఈ యంశమే గృహదాసులకు స్వాతంత్రత యుండునది లేనిది నిరూపించుచున్నది. "బానిస" అనుపదము సరిగా ప్రయోగింపబడలేదు.

వీరికి బాగుగా భోజనమిచ్చి విచారించుకొందురు.

పేరుకు స్వతంత్రులనబడు జనులకుసరిగా కూడులేకమెల్లప్పుడును బాధపడుదురు. అట్టివారికన్న వీరిస్థితి మెచ్చుకొనదగినది.

ఈ కాలములో యింటిబానిసలకు సేవకుల కు వివాహాములు జరుగుచున్నవి. ఏ విషయమునుగాని స్థాపింపగోరిన కావలసినంత సాక్ష్యమియ్యబడును.

పూర్తిగా అబద్ధము.

సంఘసంస్కారులుకది బాగుగా తెలియును.

వారికి క్రమముగా ధాన్యము కొంతసైకము నియ్యబడుచున్నది. వారికి కష్టమైన పనులు చెప్పరు. కాని వారిజీవనార్థము కావలసినంత యేర్పాటు కలదు.

ఇంటి దాసీలకు తమ దొరసానులపై నెంతటి యధికారము కలదో యింటిలోని సభ్యులలో నెట్లు కలహముల రేపుదురో యా విషయమునుండియే నిశ్చయించవచ్చును.

నిజముగా నిది స్వతంత్రతను అడ్డుపెట్టదు!

అట్లనా?

బహుకాలమునుండి వచ్చిన ఆచారములు, సంఘదురాచారములొక్క దినములో నశింపవు.

వరికి భూములు కలవు. వ్యవసాయమునినుండి వారు ధాన్యములో పాలుపొందుటకు హక్కు గలదు.

బెంగాలులో నెట్టిపద్ధతి యున్నది. కలకత్తాలో అట్లెందు కున్నది. ఎవరును అది మంచిదని చెప్పరు. కాని పర్దాచరిత్రి తెలిసికొని తక్షణమే దానినేల తీసివేయరో కారణములు కనుగొనవలెను. నీవనుకొనునట్లు సంకుచితదృష్టి కాదు, కాని విద్యాలోపము వలన నీ దురాచారములింకను పట్టుబడియున్నవి.

దీనికి కారణమేమై యుండును. దానివలన మనము పర్దాచెడ్డదని యెరిగినవారమని తెలియును. కాని సాంఘికాచారములవలన అలవాటుల వలనను జనుల దృక్పథమువలన మనమేమియు చేయజాలము.

నీ యభిప్రాయమున పురుషులకు విద్య వచ్చుననియు, స్త్రీలకు విద్యపై శ్రద్ధ లేదనియు తెలియుచున్నది. కాని నీ యభిప్రాయ మూహామాత్రమే.

తమభర్తల తమపిల్లల చూచుకొనుమనియు తాము ప్రజాహిత కార్యములందు తమ కాలమును వినియోగించ దలచితిమనియు చెప్పు పాశ్చాత్య స్త్రీల విషయమై కొంత వ్రాయవలసినదేనా కాదా?

రాష్ట్రిమంతటను బాలుర కెన్ని యున్నతపాఠశాలలున్నవి? ఈటర్ హ్యారోగేటు స్కూళ్లను గురించి నీకేమైన తెలియునా?

ధనికులు తమ బాలికల విద్యావిషయమున శ్రద్ధ లేనప్పుడు బీదవారి బాలికల నెవరడుగుదురు?

అది కొంత సత్యముగా నుండవచ్చును కాని అది పూర్తిగా నిజముకాదు. వారికి శారీరక వ్యాయామము చేయుట కవకాశము లేకుండవచ్చును. వైద్య సహాయము సక్రమముగా జరుగదు. ఈ విషయమున ధనికులును బీదలును సమానముగా బాధపడుదురు. బీదవారు హెచ్చుగా శ్రమింతురు.



"ఈ వ్యాసమువలన ముఖ్యముగా హైదాబాదు జనులలో సంచలనము కలిగినదని వినుటకు సంతోషమైనది. ఒక ప్రత్యేక న్యాయస్థానములో మనలో దాసీలయొక్కయు బాందీలయొక్కయు దుఃరాచారమును మాపుటకు యీ వ్యాసము సాక్ష్యముగా గానబడిన దని వినుచున్నాను. దాసీలయొక్కయు బాందీల యొక్కయు నాచారము ను నిర్మూలించుటకై హైదాబాదు శాసన సభలో నింతలో నొకశాసనము ప్రవేశపెట్టనున్నారని తెలిసియున్నది."

—జనార్దనరెడ్డి



# వ్యాసము



ఫార్వర్డు పత్రికా సంపాదకునికి. కలకత్తా.

అయ్యా!

కెప్టన్ హారిస్ అను నొక డాక బీద బండివానిని కొట్టుచుండగా గా॥ సేట్ గోవిందదాసుగారతని నట్లుచేయ వలదని కోరగా ఆకెప్టను గోవిందు దాసుగారిని అవమానించి కొట్టినందుల కు వ్రాతపూర్వకముగా క్షమాపణము కోరెనని హిందూస్థాన పత్రికలలో నిటీవల ప్రకటింపబడెను. గా॥ గోవిందదాసుగారు కెప్టనుపై తనకు మానసనష్టముగా ౧ లక్ష రూపాయీలు చెల్లింప వలసినదని న్యాయస్థానములలో వ్యాజ్యము తెచ్చిన తర్వాత నీ క్షమాపణము కోరవలసి వచ్చినది.

ఈ కెప్టన్ చర్య తాను అభియోగ ఫలితముగా నష్టపడునను భయముతో కూడిన సహజ ఫలితమని యెంచుటకు మారుగా అనేకులీచర్యను నతని గొప్పతనమును చాటుచున్నదని యెంచుచున్నారు. ఆర్థికనష్టమునకు భీతిల్లి క్షమాపణ కోరుటలో గొప్పతనము పెద్దరికమేమున్నదో నాకర్థమగుటలేదు. కెప్టన్ పై నాకేమియు ప్రత్యేక ద్వేషములేదు. కాని ఇంతమాత్రము నిజము. ఆతని దౌర్జన్యమునకు పాత్రుడైనవాడు ధనికుడును సుప్రసిద్ధుడును గాకుండిన లేక బండివాడొక్కడే యిందు సంబంధించిన వాడైన, రెండవపక్షముగా సేటు గోవిందదాసుఅతనిపై అభియోగము తేకుండిన పరిస్థితులు వేరై యుండును. ఇంగ్లీషువారియొక్క అందు

ముఖ్యముగా సైనికుల యొక్క చర్యలు హిందూస్థానములో నెట్టినిగా నుండునో తెలిసినవాడనగుటచే నిట్టి హింసకుడు "వీరికి వందలగు నేటివ్" జనులనుజూచి తనలో తాను నవ్వుకొని యుండుననియు, బండివానిసిగాని సేట్ గోవిందాసును గాని క్షమాపణకోరు టనుమాట మొసలి మొగుడనేర్పుటవంటిదనియు నేను చెప్పిన నెవ్వరి మెడను నన్యాయముచేసినవాడనుగాను.

ఈ యంశము (ఇండియాలో) నిదొక్కటేకాదు, ఇట్టివి పలుమారు రైల్వే డబ్బాలలోను, తదితర స్థలములలోను జరుగుచుండును. వేరుమార్గముకానక మనమిట్టి యవమానములభరించుటయేకాక ఇట్టివి సాధారణముగా జరుగుటచే జనసామాన్యము దీని కలవాటుపడిపోయినది.

ఇట్లు జరుగుచున్నను తానునష్టపడుటకన్న ఇంగ్లీషువాడు "తెల్లవానిప్రతిష్ఠ" కు లోటువచ్చినను నోర్చుకొని "యొక "నేటివ్"ను పశువురీతి వర్తించినందులకై క్షమాపణ కోరినందున హైందవులు వీనిని గొప్పతనమందును, పెద్దరికమందును నిర్మకుటరాజనియు నింకను నేమేమో వానిని స్తోత్రము చేయుటకు సంసిద్ధులగుచున్నారు.

మనదేశము అధఃపాతమొందుటకు ముఖ్యకారణము నిట్టి భావములకు మనము లోబడుట యొకటి అనినా అభిప్రాయము. అతివాదులగు జాతీయవాదులును అప్పుడప్పుడు "బ్రిటిషు న్యాయము" "బ్రిటిషుసమదృష్టి" "బ్రిటిషు గుణవిరుద్ధము" అను పదములను వాడుచుందురు. ఇట్లు చేయుటవలన నికృష్టభావనను (Inferiority complex,) మన మనస్సులలో ఇంగ్లీషు పాలకులు

తమ ప్రభుత్వారంభమునుండి పాఠశాలలో మన మెదడులందు కొట్టి పెట్టినందుననో లేక నిరంతరమగు రాజకీయ బోధనవలనను పత్రికాబోధలవలనను మన పాలకులపై మనలో గౌరవము వృద్ధినొందినందుననో లేక ఈ రెంటి వలననో చెప్పజాలను గాని వానిఘతమును గురించి మాత్రమేమియు పొరపాటు పడజాలను.

౧౯౧౯ సం॥ర ఘోరమగు అమృతసర ఖూనీల విషయమునను సుప్రసిద్ధులగు నాయకులు కొందరు, డైయరు సేనాని చర్యలు "బ్రిటిషు గుణ విరుద్ధము" అని మొరపెట్టిరి. అది అట్లు కాక బ్రిటిషువారి హింసకు నిజమగు నిదర్శనముగా నుండెను. ఇంతియకాని బ్రిటిషువారి సామ్రాజ్య ప్రాప్తి చరిత్ర యంతయు ప్రారంభమునుండియు నిట్టి నిదర్శనములతో నిండియున్నది. బ్రిటిషువారే వ్రాసిన చరిత్రలవలననే నిరూపింపబడిన బెంగాలు ఆర్డినెన్సు వంటి బ్రిటిషు ప్రసాదముల నుండి "బ్రిటిషు న్యాయము" "బ్రిటిషు సమప్రవర్తనము" అనునవి పురాణగాథ అని విశదమగును.

నాకు మొత్తముపై ఇండియా పత్రికలపై అత్యంత గౌరవము కలదు. మన పత్రికలకు ప్రకటనార్థము సహాయము చేయుటకు దేశీయ పరిశ్రమలు లేకున్నను, యూరోపు దేశములలో ప్రజలు సహాయము చేసినట్లు మన దేశమందు పత్రికలకు ప్రజాదరము లేకున్నను, నయ్యవి యనేక కష్టములకు లోనైనను నా యభిప్రాయములో నవి ప్రపంచ పత్రికలలో శ్రేష్ఠమైనవానితో బాటిగ లెక్కింపదగినవి. కాని అమెరికాలో చేసినట్లు కొంత అతిశయోక్తులతో పత్రికల నింపిననేగాని బ్రిటిషువారు మనలో నెలకొల్పిన జాతీయ వినాశనకరమగు భావములు నశింపజాలవు. విదేశీయ వార్తా ప్రేషకులు ఇండియా పత్రికలకుపంపు వార్తలను శీర్షికలతో

నుపయోగించు నప్పుడు ఇంచుక భద్రముగా నుండవలెనని యు చెప్పదలచినాడను. ఒక జాతీయవాద పత్రికలో నిటీవలనే నేనిట్లు వ్రాసినది చూచితిని. "చీనా ద్రోహులు జయమందుచు న్నారు" అనగా కాంటను వారు ఉత్తర దిక్కునకు జయించుచు పోవుచున్నారు అని భావము. ఒక హిందూదేశ పత్రిక జయ మొందువారిని "తిరుగుబాటు చేసిన ద్రోహులు" అని యెట్లు చెప్పదలచెనో నాకు దోచుటలేదు.

దీనికి చాల భిన్నముగ ఫిబ్రవరి ౧౯ వ తేదిన వెలువడిన సండేటైమ్సు పత్రికలో నొక గర్వపూరిత వ్యాసము "బ్రిటిషువా రును ఇండియాయు" అను శీర్షికతో ప్రకటింపబడెను. ఇండియాలో బ్రిటిషువారి పరిస్థితిని విమర్శించుచు సంపాదకీయమం దిట్లు న్నది:—

"ఇండియాలో నివసించు ప్రజలకన్న ఇంగ్లీషువారే ఇండి యా విషయమై మాట్లాడుటకును చర్య పుచ్చుకొనుటకును విశే షించి తగినట్టి వారనుట గమనింపదగిన యంశములలో నొకటి. ఇండియాలోని "నేటివుల" లో ముప్పాతికవంతు భూమిపై యాధార పడియున్నారు, ౫౦౦౦ జనసంఖ్య కన్న తక్కువ గ్రామములో ౧౦ కోట్లకన్న నెక్కువమంది నివసించుచున్నారు. అందు ౧౦౦ మందిలో ౧౯ మంది విద్యాగంధము లేనివారు. ఇట్టి నోరులేని కష్టజీవులగు యసంఖ్యాక జనుల భావము ప్రకటించువారెవరు? ఇంగ్లీషువారే మరి యింగ్లీషువారే!" దీనిపై విమర్శ అవసరములేదని తలతును. కాని బ్రిటిషు పత్రికలు ఇట్టి విపరీతములును, మూర్ఖములును నగు విమర్శలను చేయుటకు వెనుదీయవు. ఇట్టి నిందలకు ముఖ్య కారణ

ములను వ రు మఱతురు. మఱియు బ్రిటిషువారి సామ్రాజ్య సంబంధమగు ద్రవ్యాపహరణముల వలన ఇండియాలో కూటికి బాధపడు జనులు కోట్లకొలది కలరు. నూరేండ్లకు పైగా అపరూపపు నాగరిక రాజ్యము చేసినతర్వాత ౧౦౦ లో ౯౫ మంది విద్యారహితులుగా నుండిన కారణ మందరికిని తెలియును. అయినను రాధర్మియరు ‘పత్రికగాని యితర ‘‘జంగో’’ పత్రికలుగాని ఇంగ్లీషు బ్యాంకు గుమాస్తాలతోను, దుకాణపు పిల్లలతోను నుపకారియు, ఆత్మత్యాగియు నగు బ్రిటిషు జాతి ఇండియాలోనుండి ఇండియాలోని నేటీవుల విద్యాభివృద్ధి చేయవలసిన యవసర మున్నదని చెప్పుటకు వెనుదీయదు.



# నాల్గవ భాగము



## తండ్రికిని, పినతండ్రులకును వ్రాసిన ఉత్తరములలోని ముఖ్యభాగములు

# కళా వ్యాపార పరిశ్రమలు

౨౯-౮-౨౮

హిందూదేశములో ఉక్కుమీద పన్ను విధించి యుంచుటను నేను చూచియున్నాను. దీనికి ఉత్తరవాదులు ఎవరైనను సరే, చాల మంచిపని. రెండు సంవత్సరముల ఆందోళనము కంటె ఈ కార్యము హిందూదేశమునకు ఎక్కువ లాభదాయకము కాగలదు.

౯-౨-౨౯

ఇటీవల, నేను, కర్మాగారములో ఎచ్చటికైనను తీసికొని పోవుటకు వీలుగా నుండునట్టి యొక (Portable) శృతి యంత్రము (Hearing Apparatus)ను చేసియున్నాను. దానిని ఎక్కడనుండి యైనను, పరుగెత్తుచున్న బైసికలుమీద గాని, కదలుచున్న బండిమీదగాని, ప్రస్థలమందుగాని వాడుకొనవచ్చును. దాని సంబంధమైన పనిముట్లలో అనేకములను నేనే సిద్ధముచేసితిని. కనుక దాని మూలమున నాకు బొత్తిగా వ్యయము కాలేదు.

యుద్ధమువలన ఈ వ్యాపారము చాల నష్టపడినది. దీనిని హిందూదేశములో వృద్ధిపరుప దలచుచున్నారు. ఈ కారణమువలన ప్రచారము చేయవలసియున్నదని వారికి బాగుగా తెలియును. ఈ అనుష్ఠాన సంబంధమగు (Practical) శాఖయందు, హిందూ దేశీయులను తయారుచేయుట కంటె శ్రేష్ఠతరమగు

ప్రచార మేదికలదు? నాకు తిరిగి (దేశమునకు) పోయినప్పుడు, వారు సహజముగనే జర్మనీదేశపు వస్తువులను సిఫారసు చేయుదురు.

మనము స్థాపింపబోవు పరిశ్రమ లేవికలలో, అవి అమెరికా యొక్కయు, ఇంగ్లాండు యొక్కయు మూల ధనముతో స్థాపితములగును. మన మూలధనము మన స్త్రీలను అలంకరించుటకు ఉపయోగపడును!

౧౫-౧-౨౬

మనదేశమున కేదిమంచిదో, ఏవస్తువులు దిగుమతి చేయబడుచున్నవో మీదేశ సంచార సందర్భమున పరిశీలించిన పక్షమున చాల బాగుగా నుండగలదు. మనము చిన్న పరిశ్రమలను ఆరంభించ యత్నించినచో ఎక్కువ లాభప్రదమని నా తలంపు,

౨౬-౫-౨౬

మనమెప్పుడును నౌకరియను సుడిగుండములో నుందుము. దానిలో ఏమిలాభ మున్నదో నాకు బోధపడదు. ప్రపంచములోని ఇతరదేశీయులు ఉద్యోగప్రియులు (Enterprising) అయియుండగా హిందూ దేశీయులమగు మనము మాత్రము ఇట్టి కోరిక కలిగియున్నాము. మనము నౌకరీకొరకు చచ్చెదము (విపరీతమగు కోరిక కలిగియుందుము) అందువలన సేవకావృత్తియందుందుము.

౨౨-౮-౨౬

“సగము జ్ఞానము అపాయకరము” (Halfknowledge is dangerous,) అనుమాట సర్వసమయములందును నిజమైనదికాదు

ఇదికొన్ని వేళలమాత్రము చెల్లుచున్నది. "అసలు లేనిదానికంటెఅర రొట్టె మేలు" (Halfaloaf is betterthan none at all) అను మాటలో ఎక్కువ సత్యము కలదు. సంపూర్ణ జ్ఞానమును సంపాదించుట ఎవరికిని సాధ్యముకాదు. కొందరు దానిని కొద్దిగ సంపాదింతురు, మరికొందరు ఎక్కువగా ఆర్జింతురు; ఇక కొందరి కది ఏమాత్రము లభించదు. "నిరక్షరునికంటె అక్షరాస్యుడునయము" అను తత్త్వమును పై లోకోక్తి వలన సాధింప వచ్చును. కారణమేమనగా, జ్ఞానమనుదానికి మనము హద్దు లేర్పరుపజాలము. దానికి కొలతే ఏర్పరచుటగాని పరిమాణమును నిర్ణయించుటగాని మనకు సాధ్యముకాదు. కొంతవరకు వ్రాయను చదువను కలవాడు, ఏమియు తెలియనివానికంటె ఉత్తముడుకదా.

౧-౬-౨౫

కర్మాగారము మూయబడినదని విని చింతిల్లు చున్నాను. నష్టముగా నడుపబడుచుండెను కనుక గత్యంతరము లేకయుండెను. ఈ కర్మాగారము వలన కలిగిన లాభము ఒకటియే. అదేదన ఈ విషయమున అసంపూర్ణ జ్ఞానము కలవారి ఆలోచన చొప్పున నడచుకొన గూడదు యనునదియే.

౧-౫-౨౫

మరియొక ముఖ్యమైన వార్త (మీకు) తెలుపదగినది ఏదనగా, ఇచ్చటి జంతుశాల (ZoolagicalGarden) లో, సుమారు నూటఏబది మంది హిందూదేశీయులును, వీరిలో ఎక్కువ మంది సిలోను ద్వీపవాసులును కలరు. అడవి మృగములకు నేర్పుటయందు ప్రసిద్ధుడైన హెగెన్‌బెక్ (Hagenbech) అను నాతడు ప్రదర్శించుచున్నాడు. అతి బీద జాతివారైనను ఇట్టి

మోటుదియు సిగ్గులేనిదియునగు జీవితమును మన దేశములో ఇట్లు ప్రదర్శించి యుండుటను నేను చూచియుండలేదు. హిందూదేశము యొక్క స్థితిగతులను ఎరుగని ఇచ్చటి జన బాహుళ్యము యొక్క మనస్సులపై ఇట్టి ప్రదర్శనము ఎటువంటి పరిణామము కలిగించునో, ఇచ్చట నివసించుచున్న హిందూ దేశీయులు మాత్రమే గ్రహించగలరు. వీరు (ఈ దేశస్థులు) హిందూదేశవాసు లందరు సిరకిరులనియు, అనాగరికులనియు నిర్ధారణ చేసికొనెదరు. విద్యార్థులు దీని ననుభవింపవలసి వచ్చును.

౨౯-౯-౨౯

హిందూదేశములోని పాటకపు స్థితిగతులను విని చింతించుచున్నాను. నాయభిప్రాయమున దీనియర్థ మొకటియే; అదేదనగా, ఎక్కువ భూముల యాజమాన్య పద్ధతి అంతరించుచున్నది. ఎవ్వరైతే స్వహస్తములతో పొలములలో పనిచేయగలరో వారికే భూమి యాజమాన్యము స్థిరపడగలదు. జుగోస్లోవోకియా దేశములో నీపద్ధతియే కలదు. ఇచట విశేషముగా భూమి యజమానులే వ్యవసాయము మొదలైనవి చేయుదురు. హిందూదేశపు వ్యవసాయములో ఈవిధానము వలన మరియొకటి ఏర్పడగలదు. అదేదన, కూలిపనిని తగ్గించునట్టి యంత్రములు చివరకు కావలసి వచ్చును.

౧-౧౦-౨౯

హిందూదేశములో కర్మాగారములు నడిపోవుచున్న విషయములను గురించి నేను దీర్ఘముగా ఆలోచించినాను. దీనికి రెండు కారణములు గనుపడుచున్నవి. కర్మాగారములను స్థాపించు వారికి వాటినిగూర్చిన జ్ఞానము ఏమాత్రము ఉండదు. వాటినిగూ

ర్పిన సంగతుల నెవరైన చెప్పినప్పుడు స్థాపకులు తమ కాలోచన చెప్పువారికి ఈవిషయమున ఎక్కువ జ్ఞానము లేదని తెలిసియుండి నను వారి మాటను వెంటనే నమ్మెదరు. అట్టి వ్యవహారమునందు యూరోపియనును ఏర్పరచిన పక్షమున, ఎక్కు వజీతము ఇయ్య వలసి యుండును. ఖర్చులు ఎక్కువయగును. ఇంతేకాక, ఏకర్మా గారమును గూర్చి ఆలోచన జరుగుచున్నదో అట్టిదాని అవస రము అసలు ఉన్నదా లేదాయను సంగతిని మొట్టమొదట విచా రించ వలయును. సరకుల రాకపోకలను గురించియు, ఇతర సంగ తులను గురించియు ఆలోచించ వలెను

౭-౧౨-౧౮.

కర్మాగార స్థాపనవిషయమున ఆలోచించుటకు పూర్వము మనమెంత ధనము పెట్టుబడిగా వ్యయము చేయగలమో తెలిసికొన వలెను. ఇదిచాల ముఖ్యమగు సంగతి. జాయంటుస్టాకు పద్ధతి మీద జరిపిన ఏవ్యాపారమును, నాయభిప్రాయమున జయప్రదము కాజాలదు. అక్కరకురాదు. కనుక ఆసంగతి మొదటనేనిశ్చయించు కొనవలెను. మీరెంతద్రవ్యమును ఏదైన వ్యవహారమున పోగొట్టు కొన దలచుకొన్నారో స్పష్టముగా చెప్ప గలిగి యుండ వలెను. అట్లైనయెడల మనము బాగుగా పనిచేయ జాలము. ఏపనియు విడి చేతులతో జరుగ జాలదు.

౮-౧౨-౧౮

ఎవ్వరును అన్ని విషయములను గ్రహించుటకు సమర్థులుకా రని మీరనినది నాకు సమ్మతమే. కావున నట్టి ప్రయత్నయము చేయుటకై నాకెట్టి యభిలాషయులేదు. కాని ఇంగ్లాండులో లభించు శిక్షణమువలన విద్యార్థులకు గొప్ప పదవులు దొరకుటయే

ఫలితమని మీకు తెలిసిన యంశమే. కావున నెవ్వరైన నొక పరి శ్రమను ప్రారంభింపదలచిన నతనికి ప్రత్యేకశిక్షణ మావసరము. ఒక పరిశ్రమనుస్థాపించుటసులభమైనపనికాదు. విషయ గ్రహణము సంపూర్తిగానుండకుండిన లేక సమగ్రానుభవము లేకుండిన యేయుద్యమమును జయవంతము కాజాలదు. అట్టి శిక్షణము లేనందుననే హిందూస్థానములో ననేకములగు మంచి యుద్యమములు చెడిపోయినవి. ఎలెక్ట్రిక్ మిష్నుల డిజైనరుగా నుండుట నాకిష్టము. ఏలన నికముందు మనదేశములో ఎలెక్ట్రికు వ్యాపకము అయినట్లయిన అట్టి అవసరములు విశేషముగా నుండును.

రేడియోవంటి యొక యంత్రమును నేను గ్రొత్తగా కనిపెట్టియున్నాను. దానిని రిజిస్టర్ (Patent) చేయించ తలంచుచున్నాను. దాని నమూనాను ముందుగా రిజిస్టరు చేయవలసినదిగా నున్నందున కొంత ఆలస్య మగుచున్నది. అయినను త్వరలోనట్లు చేయుటకు ప్రయత్నించుచున్నాను. నాకన్నముందే ఇంకెవ్వరైన నిట్టియంత్రమును గనిపెట్టి రిజిస్టరుచేసినారో లేదో నాకు తెలియదు. ఈ విషయమును తర్వాత విచారించుకొనగలను.

అద్దము చిమ్నీల యంత్రాలయమును స్థాపించినసంగతి నేను వినియున్నాను. ఇట్టి పరిశ్రమలవిషయమై స్థాపకులును పనిచేయువారును అల్పజ్ఞానము కలవారగుటచే నిట్టి యంత్రాలయము (Factory) లాభమునకు మారుగా నష్టమే పొందగలదని తలచుచున్నాను. ఎన్నడైన నొకనాడవి తప్పక పడిపోవును. జనులు సహితము ఇట్టివి హిందూస్థానములో నెల్లప్పుడును నష్టమగును అని గుర్తించగలరు. ఎలెక్ట్రికు దీపములను తయారుచేయుట సులభమైనపనికాదు. దీనికొరకై చాలయంత్రములు కావలసియుండును. ఉదుడు గొట్టములతో వానిని సిద్ధముచేయుటవలన లాభ

ములేదు. ఇట్లు చేయుటచే వానిక్రయము హెచ్చగును. వానికి రాగితీగెలు పనికిరావు. వానికికావలసిన యితర వస్తువులు బజారుల లో దొరకవు. ఏలయన అవి యంత్రాలయములలోనే సిద్ధముచే యవలసియుండును. తీగె యొకేమందముతోనుండదు. దీపమునకు ఏర్పాటుచేయు క్యాండిల్ పవరును బట్టి దాని మందము మారు చుండును. తీగెను దీపముబుడ్డీలో కట్టినతర్వాత దానినుండి గాలి బయటకు లాగుదురు. మొత్తముపై ఎలెక్ట్రికుదీపముల సిద్ధము చేయవలయుననిన చాల యుత్తమమగు చాకచక్యము కావలసి యుండును.

* * * *

కొన్ని సమయములలో నాకు వ్యవసాయపు కమిషనువంటి వానిలో అభిలాష పుట్టుచుండును. దినదినము హిందూ దేశపు వ్యవసాయ పరిస్థితులు హైన్యదశనొందుచున్నవని నాకు బోధయగుచున్నది. అచ్చటి యార్థిక పరిస్థితులే దీనికి ముఖ్యకారణమని తలచుచున్నాను. కూలినాలి చేయునాడు యంత్రాలయము లో తనకు సేద్యముకన్న నెక్కువకూలి దొరకుననియు స్వాతంత్ర్య మెక్కువయనియు తెలిసికొనిన తర్వాత స్వభావముగా వాడు వానకై దేవునిపై యాధారపడినట్టి భూములలో కష్టించుటకన్న యంత్రాలయమునే యాశ్రయించును.

మన దేశములో పంజాబునందు తప్ప తక్కిన స్థలములలో ప్రతివానికి భూమి చాల తక్కువగా నుండుటచే భూస్వామి లక్షాధిపతి గా త్వరలో నగుట కవకాశము లేదు. బీదవారందరును పరిశ్రమల లో పనిచేయ మొదలు పెట్టినట్లయిన భూస్వామికన్న సేద్యగాడె

యెక్కువ లాభముపొందగలరు. మన దేశమునకు విశేషముగా పరిశ్రమలతో నవసరము కలదు. కాని పరిశ్రమల స్థాపించువారు మార్కెట్టు అవసరములను గమనించుటలేదు. ఒకేతూరి యనేక సమస్యలను పరిష్కరించుచో వారేమిచేయగలరు. మొట్ట మొదట విదేశప్రభుత్వపు (పాలసీ) యుద్దేశములతో ప్రతిఘటించవలసియుం డును. మన బాల్యమునుండియే మన చరిత్రల మూలమున మన దేశమును మనతో సంబంధించిన అన్నిటిని హేయభావముతో చూచునట్లు మనకు నేర్పుదురు. దాని ఫలితముగా మనకు ఆత్మ విశ్వాసము తగ్గును. మరియు మన పొరపాట్లను పెంచుకొని విదేశ ములవే మంచివని మెచ్చుకొన మొదలిడుదుము.

ఇందుకు తోడుగా జాతిమతభేదములవలన మన పనులన్ని యు చిక్కులలో బడుటచే మన పాలకులు తమయాభీష్టమును సుల భముగా నెరవేర్చుకొనుచుందురు.



# యదార్థబుద్ధి

౮-౪-౩౫

నా గుణములలో నొక ముఖ్యగుణము నాకున్నదని చాల వినయముతో చెప్పుకొనుచున్నాను. నే నేదైనచెప్పిన లేక చేసిన నది సద్భావముతోను యాథార్థ్యముతోను గూడియుండును.

# దాతృత్వము

---

౧౧–౧–౨౮

బోర్డింగునకుగాను ఒక యెలెక్ట్రికు గడియారమును కొన దలచినాను. క్రయము విశేషములేకుండిన నేనొకటి బహుమానముగా పంపుదును. నేను కొనజాలనంతటి క్రయముండిన నేమియు చేయజాలను.

౧౮–౨–౨౯

నేను బోర్డింగుకొరకు పుస్తకముల కొనినాడను. వానిని పార్సెలుకూడ చేసినాడను. వాటిని నారాయణరెడ్డి వెంబడినైన లేక అన్నారెడ్డిగారి వెంబడినైన పంపగలను. శ్రేష్ఠములగు పుస్తకములను తీసి పంపుచున్నాను. వానిని బోర్డింగులో భద్రముగా పెట్టినట్లయిన బాగుండును. ఈ పుస్తకములను ఓనమాల తరగతివారికి తప్ప తక్కిన విద్యార్థులందరికి పనికివచ్చునట్లుగా పంపినాను. మిడిల్ స్కూలు తరగతివారికిని మెట్రికులేషన్ తరగతి వారికిని ముఖ్యముగా నవి పనికివచ్చును. వీలైనంత మట్టుకు నన్నివిధముల పుస్తకములను కొనియున్నాను. తక్కిన పుస్తకములు కొనుటకు నాదగ్గర పైకములేదు దీనివిషయమై మీకుగాని పినతండ్రికికాని వ్రాయుట కిష్టపడను. నేనెప్పుడైన పైకముకొరకై వ్రాయుచుందునని భావింతురు. అయినను మీరెంత పైకము పంపిన బాగుండును.



## వాఙ్మయము

౧౬. ౨. ౨౫

ఒక హిందూస్థాన పత్రిక ఆక్స్ఫర్డులో ప్రచురింప బడుచున్నది. ఆ పత్రికకు నేనొక వ్యాసము వ్రాసిసినాను, వారు దానిని ప్రచురింతురో లేదో తెలియదు. ఆ వ్యాసము హైదరాబాదును గురించినది. ఆవ్యాస ప్రతి మీకు పంపుచున్నాను. రెడ్డిహాస్టలు లోని వాగ్వాదసభలో దానిని చదివిన బాగుండును.



## పాశ్చాత్యవిద్య

గ్ర్యాజ్యుయేట్లందరు మద్రాసు విశ్వవిద్యాలయ గ్ర్యాజ్యుయేట్లవలె యుందురని యింతవరకు నే ననుకొనుచుంటిని. సైన్సులో బీ.ఎ. పరీక్షలో కృతార్థుడైన యొకడు నీటికి రంగు లేదు అను విషయమే యెరుగడు.

ఇప్పుడు నేను చదువుచున్నది పూర్తియయిన తర్వాత ఏ విశ్వ విద్యాలయపు గ్ర్యాజ్యుయేటుతో నైననుసరియే నేను పోటీకి నిలువగలనని చెప్పగలను. ఇది నేను ఆత్మశ్లాఘముగా చెప్పుకొనుట లేదు. ఇదినాతో కాగలదని చెప్పుట. కావున తాము యితరయూనివర్సిటీల కన్న బ్రిస్టల్ యూనివర్సిటీ మేలైనది కాదని చింతచేయ నవసరము లేదు.

౬-౧౨-౨౨

నేను ఇండియాలో నుండినప్పుడు కొంచెము పరిశ్రమచేతనే తరగతిలో బాగుగా పేరుపొందవచ్చునని యనుకొనుచుంటిని. కాని నేను కలాశాలలో చేరిన తర్వాత నీయభిప్రాయము మారిపోయెను. నా శక్తి కొలది కష్టించిననే నేను కళాశాలలో ముందుకురాగలను కాని గౌరవడిగ్రీ (Honours degree) పొందవలెననిన ఇండియా నుండి సైన్సులో గ్రాడ్యుయేటుగానైన రావలెను లేదా విద్యార్థి అసామాన్య మేధాసంపన్నుడుగానైన నుండవలెను.

౨౪-౧౨-౨౨

ఇచ్చటి బాలురనిన నాకు ప్రేమ మెండు. వీరు ప్రీతి పాత్రులుగను ధైర్యవంతులుగను నుందురు. అచ్చటి ౨౭ యేండ్లయువకులును నిట్లుండరు. వీరికి భయమన్న నేమియో తెలియదు. వీరి తల్లి దండ్రులు వీరిని భయపెట్టరు. తొందర పెట్టరు. చిన్న చిన్న బాలురు దుకాణములకుగాని విహారార్థము గాని పోయినప్పుడు వారివెంబడి నౌకరులెవరును పోరు. ప్రతివారము వారికి కొంత జేబు పైకము వారి తల్లిదండ్రు లిత్తురు. వారి స్నేహితులతో గూడ పోవు చుందురు. వారి విద్యాభ్యాస పద్ధతియే వేరు. వారిని మితి మీర చదివింపరు. ఇంగ్లీషువారు తమ పిల్లలను బాగుగా తరబీతు చేయుటచేతనే యాజాతి కింతగొప్పతనము కలిగినది. వారికి నానా విషయక జ్ఞానము చాలవిశేషముగా నుండును.

---

ప్రియమైన పినతండ్రిగారికి

ఈ కాలమునకు తగినట్లుగా వారికి విద్యచెప్పించుట లేదని వ్రాసి నందులకు క్షమింపగలరు. వారికి మితిమీర చదువు చెప్పు

టయు—అదియు కంఠపాఠము చేయుటయు సరికాదు. అట్లుచేయుటచే వారు స్వయముగా నాలోచించుట కవకాశములు తక్కువయగును. వారు ముందు పెద్దతరగతులలో జేరినప్పుడు మెదడు పని చేయక మొద్దుబారుదురు. వారు స్కూలులో నెట్లున్నను యింటిలో వారికి విశేషించి చదివించకూడదు. వారు చెడ్డసహవాసము చేయకున్న చాలును. నిదానమైనను వారు తప్పక వృద్ధికి రాగలరు. కొంతకాలము క్రిందట నేను నాబైస్కలు పట్టుకొని నిలచి యుండగా ౧౦-౧౧ ఏండ్లబాలుడొకడు నాకు సలాముచేసి (గుడ్‌మార్నింగ్) ధైర్యముగా నా దగ్గర నిలబడి "ఇది సన్‌బీమ్ నమూనా సైకల్ కదా" అని నన్నడిగెను. "అవును" అనియంటిని. తర్వాత తానేమొ యింజనీయరువలె దాని వివరము లనేకముల డిగెను. ఆబాలుడన్ని వివరముల తెలిసికొనియుండుట నా కాశ్చర్యము కలిగించెను. ౧౩-౧౪ ఏండ్ల బాలురు తమయింటిలో నొక గంట కూడ పనిచేయరు; కానివారు ఆడుకొందురు లేక తోటలకు పోవుదురు. ఇట్లు నేను వ్రాయుటచేత నేమియు కఠినముగా వ్రాయలేను. కావున నేనేమైన విశేషించి వ్రాసినట్లయిన నన్ను క్షమింపవలెను. ఇంగ్లాండునకుగాని యూరోపునకుగాని అమెరికాకుగాని పోయిననే మనవారు మగవారని పించుకొందురని యొకరు నాతో చెప్పిరి.

౭-౨-౨౩

ఇప్పుడుండు స్వాతంత్ర్యము కన్న హెచ్చుగా మన బాలురకుండవలెనని మీకు చూపించుటయే నాయుద్దేశముకాని తదితరము కాదు మనలో స్వాతంత్ర్య భావములు లేనందుననే మనము సంకుచితస్వభావుల మగుదుము. మన పిల్లలను ఇంగ్లీషు లేక యూరోపు బాలురతో సరిపోల్ప జాలము. ఏలన వారికిని మనకును చాల

వ్యత్యాసము లున్నవి. అయినను మన బాలుర కెక్కువ స్వేచ్ఛ నిచ్చిన మనము బాగుపడుదుము.

౧౨-౫-౧౯

మీ రనినట్లు నే నక్కడనుండి నప్పుడు కష్టించకుంటిని. ఇంటి దగ్గర యనేక పరిచితులతో నుండుటచే సోమరితనము హెచ్చునని నా కిప్పుడు తోచుచున్నది. అయితే విదేశములో ననేక కష్టములకు లోనై జీవిత సమస్యచే నెదుర్కొన బడిన తర్వాత యెంతటి సోమరిపోతైనను చురుకుతనమును గలవా డగును.

౫-౬-౧౯

మన విద్యార్థులు తాము ముందేమి చదువనున్నారో నిశ్చయించరని తాము చెప్పువాక్యములతో నేకీభవింతును. అయితే మేమిట్లు నిశ్చయించుకొనినను లాభములే దనవలెను. ఏలన అక్కడనుండు విద్యాపద్ధతికిని యిచ్చటి దానికిని చాల బేధమున్నది. ఇండియాలో రెండేండ్లకన్న నెక్కువ చదువు విషయములు నిక్కడ సంవత్సరము లోపలనే నేర్చుకొందురు. కారణమేమన మనవారు అన్నిటిని నేర్పింప జూతురు. ఇచ్చటట్లు కాదు. సాధారణ పరిశ్రమ కెంతయవసరమో యింతయే నిచ్చటివారు కోరుదురు. మనకట్లు కాక డజనులకొలది యుపాధ్యాయుల నేర్పాటుచేసి బాలురను పరాధీనులుగ సోమరులనుగా జేయువాడుక కలదు. ఇచ్చటి బాలురు తమకృషిపైనను లేక స్కూలులోని బోధపైనను నాధారపడియుందురు.

౧౩-౫-౧౮

ఇచ్చటిజనులు నిజముగా జీవితము యొక్కయు స్వాతంత్ర్యము యొక్కయు పూర్తివిలువ నెరిగి వానిని సంపూర్ణముగా నుపభోగించుకొందురు.

మనకన్న వేయురెట్లు అధికముగా నీజనులు జీవితావసరముల తోఁగూడిన వారుగా నుంపారు. నేనుండు యింటిలోనే ౧౭ ఏండ్ల బాలు డొకడున్నాడు. అతఁడు వాదింపనేరని విషయమును గురించి నేను మాట్లాడజాలనని చెప్పుకొనుటకు సిగ్గుచున్నది. ఇంతేకాదు అతడు నాకన్న నొకటి రెండు విషయములలో మేలైన వాడు. అతడు సంగీతమందు చిత్రలేఖన మందును ప్రవీణుఁడు. అతఁడు ఎలెక్ట్రిక్ ఇంజనీయరింగులో నొక సంవత్సరము తరబీయతు పొందియున్నాఁడు.

* * * *

ఇచ్చటి జనులతో నేను పరిచితుడనయిన తర్వాత దానికిని మనకును గల భేదమును గ్రహించి యున్నాను. ఇచ్చట ప్రతి బాలుఁడును స్త్రీయును, పురుషుఁడును తమతో నాత్మవిశ్వాసము మెండుగా కలిగి యున్నారు. మన మన్ననో యీ గుణము నకు విరుద్ధముగా నడచుకొను చున్నాము.

౧౭-౨-౨౧

నిస్సంశయముగా నింగ్లాండులోకన్న జర్మనీలో మనము హెచ్చుగా నేర్చుకొన వచ్చును. కారణ మేమనగా ఇంగ్లాండు వారు సైన్సులో (శాస్త్రములలో) చాల వెనుకబడి యున్నారు. మఱియు వారి విద్యాపద్ధతి చాల లోపభూయిష్ఠము. తాను నేర్చుకొన వలసినంత నేర్చుకొన జాలడు. నేను మరల విద్య ప్రారంభించిన జర్మనీకి గాని యితర స్థలమునకు గాని పోవుదును. కాని ఇంగ్లాండునకు మాత్రము పోను. దీని కారణములు వారి విద్యా పద్ధతిలో లోపమే కాక వారు మాయెడ నడచుకొను పద్ధతియునై యున్నది. మనము వారి బానిసలమని యెల్లప్పుడును భావించు కొనునట్లు చేయుదురు. వారిలో నిజమైన మైత్రి లేదు.

వారికి రంగువారిపై దురభిమానము కలదు. ఇచ్చట (జర్మనీ) మమ్ముల పరదేశీయులనుగా జూతురు కాని మేము స్వేచ్ఛగా సుఖముగా నున్నాము. ఈ రెండు దేశములలో నిదియే భేదము. ఇండియాలో మనము ఇంగ్లాండును పర్వస్వాతంత్ర్యము గలదిగా భావింతుము.

౭-౧౦-౨౫

ఇంగ్లాండులో మమ్ముల నీచముగా జూచినట్లు బర్లినులో చూడరు. అచ్చట మమ్ముల కనిష్ఠులనుగా జూతురు. ఇక్కడనో విదేశీయులను జూచినట్లు జూతురు.

౨౦-౧౦-౨౫

ఇచ్చటి యంత్రాలయములలో నవీన పద్ధతుల నన్నింటిని నేర్చుకొనకుండిన యూరోపులో చదివి లాభములేదని నా కనిపించుచున్నది.

* * * * * *

ఇంగ్లీషువారు నేర్చువిద్యా పద్ధతిప్రకారము కొన్ని పుస్తకములు చదివి కొన్ని పరీక్షలిచ్చినంతనే యెవడును సమర్థుడు కాడని నా యభిప్రాయము. ఇంగ్లాండులోను ఇండియాలోను ప్రతివాడును స్కూలుకుగాని కాలేజికిగాని క్రమముగా బోవలసియుండ జర్మని కలాశాల విద్యార్థి తన యిష్టము వచ్చినట్లు చేయుటకు స్వతంత్రుడై యున్నాడు. జర్మనీలో విద్యార్థికి క్రమముగా హాజరీ ఇయ్యవలసిన యవసరములేదు. మరియు నిర్ణీత సమయమందు పరీక్షయియ్యవలసిన యవసరములేదు. అతని యిష్టమువచ్చినప్పుడు పరీక్షకు కూర్చునవచ్చును. కాని యతడట్లు చేయుటకు

పూర్వము ఒక ప్రత్యేకవిషయమును గుఱించి వ్రాసి (Thesis) యియ్యవలెను. పరీక్ష వ్రాతమూలమునగాక సవాలుజవాబు మూలముగా జరుగును. ఇట్లు జరుగుటచేత చురుకుగలవిద్యార్థులు తాము కృతార్థులగుటలో సందేహముండదు. మరియు మోసము చేయుటకు వీలుండదు. ఈ పద్ధతిచే విద్యార్థులు గొప్పవారగుట కు సహాయకారియగును. మరియు నింటిలోని ప్రోత్సాహమువల న స్వాభావికముగా విద్యార్థి తనకిష్టమువచ్చిన విద్యాశాఖలో తరబీతునొందుటకు ప్రేరేపించును. మరియు ఇండియాలోను ముఖ్యము గా ప్రాగ్దేశములందును కనబడు గృహజీవనము దలి నానాశాఖత్వము ఇచ్చటలేదు.

౧౯ ౨౬.

ఇంగ్లాండునకువచ్చు విద్యార్థులలో ననేకులు మూడు అభిలాషలతో వత్తురని నా అభిప్రాయము. ఒక తరగతి తమపేరునకు తర్వాత ఇ. ఆర్. (ఇంగ్లాండువాపసుగారని అర్థము) అను నక్షరముల తగిలించుకొనునభిప్రాయము కలిగియుందురు. రెండవ తరగతివారు తమకు మంచి యుద్యోగములు లభించవలెనని ప్రయత్నింతురు. మూడవతరగతివారు ద్రవ్యమును వ్యయముచేసి కాలహరణము చేయజూతురు. మొదటి రెండు అభిలాషలు నిష్ప్రయోజనములు. కడపటి యభిలాష యెచ్చటనైనను నీడేరగలదు. జర్మనీనుండి యిచ్చటికి వచ్చువారు తమ స్వేచ్ఛతోనైన వత్తురు. లేక వారిని (తమవారు) ఏదైన నేర్చుకొనుటకు పంపుదురు. జర్మనీనుండి వచ్చిన కొందఱు ఇంజనీయరింగు విద్యార్థులను గలసితిని. ఇంగ్లీషు రాజ్యయేట్లకును (స్వాతికులకు) వారికిని చాల భేదము కలదు. వారు నిజమైన ఇంజనీయర్లు. మనవిద్యార్థులు నౌకరీకొఱకై యిచ్చటికి రానట్లయినవారికి యింగ్లండునకు బదులుగా యూరోపులోని ఇతరదేశములకు పంపుట మంచిది. ఉదాహరణార్థము

వైద్యమునకు వియన్నాకు లేక జర్మనీకి, కెమిస్ట్రీ, సైన్సు, ఇంజనీయరింగుకుగాను జర్మనీకి పంపుట మంచిది. ఇంగ్లాండుకూడ బి. యస్ సి. బారిస్టరు, సివిల్ సర్వీసుల వంటివానికై మేలైనదే.

౪—౧—౨౬.

నిశ్చయముగా నేను ఇంగ్లాండులో గడపిన మూడు సంవత్సరములు మరల నాకిచ్చిన నేను అచ్చటికి చదువుటకై పోను. ఇంగ్లాండులోని విద్యాభ్యాసమునందలి లోపములను నేను జూపించినట్లైన మీరు నన్ను దానిపై దురభిప్రాయము కలవానినిగా నెంతురు. కాని అది యదార్థముగాదు.

౧—౧౧—౨౬.

జర్మనీలోని విద్యాపద్ధతులజూచిన తర్వాత నా విషయమై నాకు చాల చింతకలుగుచున్నది. నేను ఇంగ్లాండులో గడపిన మూడు సంవత్సరములు జర్మనీలో నొక సంవత్సరము గడిపిన దానితో సమానము. ఇంగ్లాండులో జర్మనీలో నున్నట్టి విద్యావిధానము లేదు. జర్మనీపండితులు కూడ మేలైనవారు. అయినను యిప్పుడు తలచుకొని లాభములేదు.

* * * * * *

ఫుల్లారెడ్డిగారికి విద్యార్థి వేతనము దొరకినదని వినుటకు నాకు చాల సంతోషమైనది. అతడు దీని కర్హుడేకాని ధనవంతుడగుటచే అవసరము లేదు. హైదాబాదులో నిట్టి తమాషాలు జరుగుచునే యుండును. ధనికులగువారే విద్యార్థి వేతనముల పొంది విదేశములకు పోదురు. ఎట్లయినను నాకు సంతోషమే. అతడు స్వజాతివాడని సంతసించను. కాని అతడు కల్పనైన తలచుకొని

౨౧

యుండవట్టి యనేకవిషయముల యూరోపులో నేర్చుకొనగల దని సంతోసించుచున్నాను. అతడు ఇంగ్లాండునకు పోవుటకు మారుగా అతడు జర్మనీ ఫ్రాన్సు, ఆస్ట్రేలియా లేక తుర్కీకి పోయియుండిన బాగుండును. ఎందుకన ఇంగ్లాండులో వైద్యశాస్త్రముచాల వెనుకబడియున్నది.

* * * * * *

......అనువారు జర్మనీకి వచ్చుచున్నారని వినుచున్నాను. అతడు అట్లుచేయుట చాలమంచిది. దేశాటనముచేతనే ప్రతివారికి ప్రాపంచికజ్ఞానము కలిగి భావవైశాల్యము కలుగును. ఎట్లయినను ధనికులగువారు యూరోపునకును అమెరికాకును పోయిచూచుట మంచిది.

---

## కృతజ్ఞత

౨౨ — ౯ — ౨౯.

తాము పంపిన ౧౨౦ సవరనుల చెక్కుచేరినది. సకాలమునకు తామెల్లప్పుడును పైకము పంపుట తమ దయావిశేషము. తమ దాతృత్వమునకు నాకు చాల సంతోషము. దానికై మీకెంతయు కృతజ్ఞుడను. ఇట్టి కుటుంబములో నేను జన్మించినందులకు నాకు సంతోషము. అందులకై నేను పరమాత్మని స్మరింతును. నేను అనవసరముగా ద్రవ్యము ఖర్చుపెట్టనందున నాకు పైకము తక్కువ పడదు. మీరెప్పుడైనను కొంచెము పైకముపంపించిన నాకు ఇబ్బందులేమియు నుండవు. మీరు పైకము ఉదారముగా పంపు

టయేకాళ నావిషయమై యింత శ్రద్ధతీసికొని విచారించు కొనుచు న్నందున నాకు చాల సంతోషము కలుగుచున్నది.



## కాలక్రమము విలువ

—

౮-౧-౨౬

ఎలెక్ట్రికు గడియారములు గంటలు మున్నగువారికి ఆనేక వందలమార్కులు (జర్మనీ నాణెములు) కావలసియుండును. కాలము యొక్కయు, సకాల కార్యక్రమముల యొక్కయు, విలువ మనకు తెలియ నందున అవి చాల అవసరము.



## పాశ్చాత్య నీతులు

—

౨౧-౯-౨౬

ఇటీవల సర్. రవీంద్రనాధఠాకురుగారు ఇచ్చటికి వచ్చియుండిరి. నేను కార్యదర్శిగానుండు సంఘము పక్షమున నొక గొప్పవిందు వారికిచేయబడెను. ఈ విందునకు ఆహ్వానింపబడిన జర్మనీ ధనికులతో నేను కలియుట కవకాశముకలిగెను. ఇతర జర్మనులవలెనే వారును చూడబడిరి. వారే హిందూస్థాన జనులైయుండిన వారు గర్వించి దూరముగా నుండియుందురు. యూరోపియనులలో నిట్టి (నిగర్వ) ఆచారముండుటచేతనే వారింత గొప్పవారై యున్నారు.

# హైందవ జీవనము

తారీఖు లేదు

అమ్మగారు అస్వస్థతగా నున్నారని తెలిసినందున నాకు చాల వ్యసనమగుచున్నది ఆమె కెప్పటికిని నేదైనయొక విషయములో చింతయుండు చుండును. ఇండియాలో మన జీవనమంత సుని ర్మలయుండదు. అచ్చట సౌఖ్యముగా జీవించుట నేరము. మనకోరి కలకు దగినట్లుగా మనము ప్రారంభించిక సౌఖ్యము ననుభవించలేము. కారణమేమన బీదవారు కాసట్టి మనవంటివారు కష్టపడి పనిచేయరు. మనము కష్టపడనిది సౌఖ్యముండదు. నే నివన్నియు నెందుకు వ్రాయుచున్నానో నాకు తెలియదు.

# మన సాంఘిక స్థితి

౨-౨ ౨.౩౫

నేడు ఆఫ్ఘనిస్థానపు అమీరుగారు ఇచ్చటికి వచ్చుచున్నారు. సుమారు ౬౦ లక్షల జనసంఖ్యగల చిన్న రాజ్యపు పరిపాలకుడే యైనను, ఇతడు మన కొందరు మహారాజులతో సరిపోలువాడే యైనను నితని కిచ్చట చాల గౌరవము. ఇచ్చట జూడ వ్యసనకరముగానున్నది. అమీరుగారు కేవలము గౌరవము కొరకు వచ్చుట లేదు. వీరు ఇచ్చటి యంత్రాలయములను, పరిశ్రమల పరిస్థితులను పరీక్షించుటకు వచ్చుచున్నారు. వీరి భావములకును మన మహారాజుల భావములకును నెంత భేదమున్నదో కనుడు. మన మహారాజు లిచ్చటికివచ్చి యేదోయొక హోటలులోదిగి, జల్సాలుచేసి

మాయమగుదురు. మనకును స్వాతంత్రజాతికిని భేదమువలన నిట్టి గౌరవములు (అమీరుగారికి జరుగుచున్నవి.) ఆఫ్ఘనులు మనకన్న మొదటి వారైనను వారు స్వాతంత్ర్యులు.

౧౫-౫-౩౮

మన సాంఘిక పద్ధతిపై నాకు చాల అసహ్యము. నాయభిప్రాయమున సంఘసంస్కారము చేయబడకుండినయెడల మనము శాశ్వత దాస్యమందే యుండగలము. ఇంతేకాదు నేటిసిద్దీలతోడను, లేక, అడవి మనుష్యులతోడను మసలను సరిపోల్చగలను. కొంత మన మూర్ఖ్యమువలనను, కొంత మన బలహీనమువలనను మనము హిందూస్థానమును విదేశీయుల పాలుచేసితిమి. ఈకారణముచే గత శతాబ్దమునుండి మనలో నభివృద్ధి లుగక యథాప్రకారసిద్ధిత్వమే కలిగినది. ఒక శతాబ్దము క్రిందట మనకన్న మించిన నాగరికత లేనట్టి యూరోపువాసులీ యంత కాలములో చాల వృద్ధికి వచ్చుటచే వారికిని మనకును అపారమగు భేదము కలిగినది. దినదినము వారి వృద్ధి ప్రచండవేగముతో జరుగుచున్నది. ౧౫౦ సంవత్సరములలో చేసినంతపని గత ౩౦ సంవత్సరములలో ౧౯౦౮ నుండి ౧౯౩౮ వరకు వారు సాధించినారు. వారు వృద్ధికివచ్చుట యంతయు ముందంజవేయుటయై యున్నది. మన సాంఘిక పరిస్థితులున్నవున్నట్లుగా నుండిన మనము ముందుబడము. మన సాంఘిక జీవనము సంకుచితపద్ధతిపై నాధారపడినందున మనము మన బాల్యావస్థనుండియే సంకుచితాభిప్రాయులమై యుందుము. ఉదాహరణార్థము, మనము భోజనపానీయములను ముసల్మానుగాని, హిందువేతరుడుగాని ముట్టిన పారవేయుదుము. ఇట్టియాచారములనేకములున్నవి.



# రాజకీయములు

౨౨—౧౧—.౨౨

నేను కాలేజికి పోవుచుండగా అందముగా నగపడు నొక పెద్దమనుష్యుడు నా దగ్గఱకువచ్చి నీవు కళాశాలలో చదువువాడ వా యని విచారించెను. అవునని చెప్పితిని. వెంటనే ౧౯—౨౩కి క్యాలండరొకటి నాకిచ్చెను. ఆ బహుమానముచూచి నా కాశ్చర్య మయ్యెను. కాని దానిమీద నెక్కడ జూచినను ‹‹గిబ్సు''కు మీ వోటు ఇయ్యుడ'' అని అచ్చువేసియుండిరి. నేను దానిని జూచు చుండగనే అతడునన్నిట్లడిగెను. ‹‹మీరెవరికి వోటుఇత్తురు.''నాకు కాలేజికి పోవనవసరముండుటచే తొందరగా నుండెను. కావున నే నిట్లంటిని ‹‹.అందేమి సందేహము. నేను గిబ్సుకే వోటిత్తును. అతని యందెనాకు ప్రీతి'' ఈ మాటవిని అతడునన్ను వదలిపోయెను నేను గిబ్సుకు వోటివ్వనని చెప్పియుండిన నతడు నా నొకయుపన్యా సమే వినిపించియుండును. ఈ ప్రకారము ఇచ్చట ఎన్నికలు జరు గును. నిజముగా అభ్యర్థులే జనుల యభిప్రాయములెట్లున్నను తామే తమను ఎన్నుకొను వారుగా గనబడుదురు. మీదు మిక్కిలి వీరు ప్రజాప్రతినిధులమని చెప్పుకొందురు. ఇది న్యాయమైన మార్గమని నేను తలంచను.

౨౨—౧౧—౨౨

ఈ ఇంగ్లీషువారి నిజతత్త్వముగుర్తించవలయునన్న ఎన్ని కలకాలములో నిచ్చటికివచ్చి వీరిని గమనింపవలెను వీరు బూ టకపుజాతి. తమదేశము ప్రపంచమందంటను శ్రేష్ఠమైనదని నటిం తురు. నేను చూచినదంతయు హాస్య జనకముగా నున్నది. ఏలన

ఎన్నికల సమయములో వీరొకరి నొకరిని నిందించుకొని కొన్ని సంగతులను బహిరంగపఱచుకొనుచున్నారు.

౩—౧౦—౨౩

ఇంగ్లాండు నిరంతరముగా ఇండియాను పాలించవలసినదను మీ యత్న ప్రాయములతో నేకీభవించను. మనలో వందలకొలది శాఖలు పరస్పర కలహాలములతో కూడినవై యుండవచ్చును. కాని ఈ కారణముచే మనకు స్వాతంత్ర్యమును నిరోధించకూడదు. ఎట్లున్నను అభిప్రాయ భేదములుండుట సహజము. నేను రాజకీయములలో ప్రవేశించుటలేదని చేసిన వాగ్దత్తమునకు విరుద్ధముగా నడచుకొనలేదు. రాజకీయములనుండి దూరముగ నుండగోరినను అదిసాధ్యముకాదు. మన కేమిహక్కులుకలవు? మనకేస్థానమొసగబడినది? ఒకడుతన కుక్కను తనసొత్తుగా భావించునట్లుగా మనము చూడబడుచున్నాము. అంతకన్న మనము హీనమనవచ్చును. కుక్కను యజమానియొక విధముగా ప్రేమించును. కాని మనకు యజమానులమని చెప్పుకొనువారు మనల నంతమాత్రమైనను జూడరు. వారి నిజభావములను వారు ప్రకటించుకొనకున్నను వారి తరమార్గములచే విశదముగా తమ భావములను ప్రకటింతురు బహిరంగముగ కాకపోయిన యేదోనాక మార్గము చే వారు మెచ్చటజూచినను తమ «నల్లనిప్రజల» ను హేయముగా జూతురు. అభిమానుడగు వారందరును దీనిని గుర్తింపగలరు. వారికన్న మనము కొన్ని విషయములలో లోపించిన వారమని యొప్పుకొందును. కాని యంతమాత్రమున కే మనల లెక్క జమాలేని వారిని గాజూచుట సరియైనది కాదు. ఇచ్చట «ఇండియా కుపోయి కోటీశ్వరుడై వచ్చెను» అని యొక సామెతగలదు.

వలన వీరివలన ఇండియా భాగ్యవంతమగుటకు మారుగా దరిద్రదశను పొందుచున్నది. ఇట్లు వ్రాయుటచే నేను వారిని నసహ్యముతో జూచి తినని తలపకూడదు. నేను నా కండ్లతో జూచిన యదార్థాంశములను తెలుపుచున్నాను.

<u>౨౪-౪-౨౩</u>

నేను రాజకీయములలో ప్రవేశింపకున్నను నీయింగ్లీషువారలు చేయుపనులను జూడవలసి వచ్చుచున్నది. ఈ జనులసంపర్కము విశేషమగుకొలది మన స్థితిగతులు మనకు స్ఫురించుటచే మనకు అసహ్యముకలుగుచుండును.

<u>౫-౩-౨౪</u>

లేబరుపార్టీవారు ప్రభుత్వాధికారులైనందున మనకు స్వరాజ్యము లభింపవచ్చునని మీరు వ్రాసినారు. మన కట్టిదేమియు దొరకదు. ఎవరు ప్రభుత్వమునకు వచ్చినను బంగారు గనులవంటి వస్తువును వారెన్నడును పోగొట్టుకొననొల్లరు. ఇండియా వారికి బంగారు గని కన్న మించినదని నా యభిప్రాయము. సోషలిస్టిక్ అభిప్రాయములచే వారు మనల నింకింత నిరాధారులనుగా జేయుదురు.

ఇప్పుడె మనకు స్వరాజ్యము కావలెనని నేనను. కాని మనము కోరునది మానవత్వము. నాకు రాజకీయములంతయు. ప్రతి దినము వార్తాపత్రికలు చదువుటయే యగును మీరు నమ్ముదురో నమ్మరో? లిబరల్ పత్రికలు సహితము వ్రాయుదానిని జూచిన మనపక్షమున వీరు చాల యన్యాయము చేసినారని తోచుటచే

క్రోధము కలుగుచున్నది. (ప్రకాశకుని నోటు:—కాంగ్రెసు వారు చేసిన దానికన్న నిట్టిపద్ధతియే యింగ్లీషువారికి కష్టదాయక మైనది.)

ఒక పత్రికలో నొకరు—లేబరు ప్రభుత్వము ఉత్తమ కాన్సర్వేటివ్ ప్రభుత్వమని వ్రాసినది చూచితిని వీరుప్రభుత్వస్థానము కు వచ్చిన తర్వాత యీప్రకార మగుదురని నేనెన్నడును తలచలేదు. ఇచ్చటి జనులు విదేశీయులు తమ దేశములో నుండుటను సహించనందున విదేశీయులను ప్రేమించరు.

మనము వారి బానిసలమని వారు భావింతురు. తమ చరాస్తులకన్న మేలుగా మనము భావించనందున తమకిష్టము వచ్చినట్లు చేయవచ్చునని తలంచెదరు. వారు మనలను జూచు పద్ధతి అసహ్యకరముగను అవమానకరముగను నుండును. వారి విశ్వవిద్యాలయము లందున్నవారు మనల నీచముగా జూతురు. మనము వారి జాతి వారముకాని దొకటి, మనస్థానము ప్రపంచములోగణనీయము కాని దొకటి, దీనికి కారణములు. ఇచ్చట మేము మాద్రవ్యముతో చదువుచున్నామని తలంచునట్లు వారుచూడరు. మనము పిలువని పేరంటమునకు వచ్చిన వారుగా భావించుకొనునట్లు చేయుదురు ఎంతటి నిగర్వియగు సహాధ్యాయుడైనను సరియె బజారులలో మాతోకలసిన మాట్లాడుటగాని, పరిచయము చూపుటగాని నొల్లడు. ఇంతమాత్రమున వారిని ప్రశంసింపవచ్చును. వారు తమ భావములను బయటపడనీయరు. శాంతముగా గనబడుదురు. తమ స్వార్థపరత్వమును గురించి యేమియు ప్రకటించుకొనరు. తాము న్యాయబుద్ధి కల వారమని చెప్పుకొందురు. తమలో తామట్లుందురేమో. నూటికి ౭౦ పాళ్లలో నే

విద్యార్థియైన ఫుట్బాలు లేక హాకీపందెములలో నాడినట్లయిన వానికి యూనివర్సిటీ బహుమానమిత్తురు. గత సంవత్సరము ఇద్దరు ఇండియన్ విద్యార్థులు శ్రేష్ఠముగా హాకీ ఆట ఆడి నూటికి ౬౦ పాళ్లు పందెములలో పాల్గొనిరి. హాకీక్లబ్బువారుకలసి నప్పుడు అధ్యక్షుడు ఇండియనుల విషయమై ««ఈ నల్లవారి పేరులు కొట్టి వేయుడు. ఇంగ్లీషు వారి విషయము మొలు చర్చించుడు" అని పలికెనని ఒక ఆస్ట్రేలియా సభ్యుడు నాతో చెప్పెను. మనల నెందు లకిట్లు అవమానము చేయుదురో అని నా కాశ్చర్యము కలుగు చున్నది. మనముకూడ మానవులమే కదా! దీనికొక జవాబు ఏమ.. మన స్వదేశమందే మనకాత్మ గౌరవములేదు అట్టిచో వీరి దేశములో వీరిచే మనకెట్లు గౌరవములభించును. తమ పనులలో మనము ప్రవేశించి అనుభవము పొందుటకై వా రొప్పుకొనరు. మొత్తముపై మన విద్యాభ్యాసములో కావలసినంతవరకు సహాయ్యము కలిగింతురు. ఇచ్చట అనేక ఆంగ్లో యిండియనులున్నారు. నాయభిప్రాయమున నింతకన్న యసహ్యకరమగు వస్తువులులేవు (నా తీవ్రతను క్షమింపవలెను. కాని నాయనుభవము ను బట్టి వ్రాయు చున్నాను) కొంత కాలముక్రింద నేనుండునింటిముంగట నిలువబడి వాహ్యాళికి వెళ్లుదమని యనుకొనుచుంటిని. ఒక ౬౦ ఏండ్ల వృద్ధుడు దారిబట్టుకొని పోవుచుండెను. అతడునన్ను జూచిన వెంటనేనిలుచుం డి యేమియో గొణుగుకొని నన్నుసమీపించి "నీవుఇండియనువా" అనినన్ను ప్రశ్నించెను. అవునని నేను జెప్పగా అతడు నాతో "నీజాతిని జూచికొని నిన్ను జూచికొని నీకు సిగ్గురాదా" అని యనెను. నాకాశ్చర్య మయ్యెను. నిరుత్తరుడనై తిని. కాని యెట్లో యతనిని దానికి కారణమేమని యడిగితిని "హిందూ స్థానము నుండి తెల్లసాహెబులను మీవారెందుకు వెళ్లిపొమ్మను చున్నారు? సగము తెలివితప్పిన మీనల్లజనులకు సరిగా బట్టకు గతి లేకున్నను

తమ దేశమున తామే విచారించు కొందుమని కలగను చున్నారు. నేనా దేశము లో బహుకాలము పనిచేసి యున్నాను" ఈ ప్రకార మతడు నాతో జెప్పెను ఇట్టిదాని విషయములో మీరేమను కొందురు. ఇట్టివారి నేమనవలెనో చెప్పుడు. ఒకవిధముగా తనమన స్సులో నుండుదానిని ప్రకటించు నట్టివారిని మెచ్చుకొన వచ్చును, ఇక్కడ నుండినంత కాలము ప్రతి క్షణమును నిట్టి విషయము ను జూచుచుందుము. స్వయముగా నేనిచ్చట నుండుటలో నా క్షేమియు సంతోషము లేదు. నామేలుకొరకే నేనిచ్చట నున్నానని సమా శ్వాసము మాత్రము కలదు. మన జాతీయతలో లోపముండనీ, మన మతములలో భేదములుండనీ నింకేమైన నుండనీ— ఈ జనుల శరీరాద్యంత మందుండు దానికన్న నెక్కుడు మానవత్వముల మన వ్రేళ్లలో నున్నది. నేను మొద్దుబారిన వానివిగా నుండిన నేనిట్టి పరిస్థితుల లెక్కించకుంటిని, కాని యిప్పటిస్థితిలో నేను తీవ్రముగా చెప్పక యుండజాలను. కాన క్షమింపగలరు. విసుగుకలిగించు నా యుత్తరములను జూచి మీరన్యథా భావించకుడు. మీకేమైన కోపమువచ్చిన నన్ను క్షమించుడు. కోపము సాధారణముగా తత్ప్ర కటనముచే శమించునను విషయమును గమనింప గలరు.

౧౦-౩-౨౮,

బీరారు బాబతులో మనవారు దప్రక్యము ను అత్యంతముగా వ్యాయామము చేయుచున్నారు. నాయభిప్రాయమున మన నిజాము ప్రభువు గారికది. దొరకదు అట్లున్నను కొంత కాలము క్రింద "టైమ్సు" పత్రిక బీరారు విషయములో అనుకూలముగా వ్రాసి యుండెను. ఇంతేకాక నిజాముగారి సుందరమగు పటమును కూడ ముద్రించి యుండెను. నాయభిప్రాయమున దీని ఫలిత మేమియు నుండదు. ఓపికపట్టిచూచిన అంతయు విశదమగును.

౨౬-౩-౧౮.

సర్ అలీ ఇమాముగా రిచ్చట నున్నారు. అతడేమి చేసినను లేబరు ప్రభుత్వమువారు నిజామునారికి బరారునియ్యరు. ఇతర ప్రభుత్వము లిచ్చునేమో కాని లేబరు మా త్రమివ్వరు. సర్ అలీ గారికింత ద్రవ్యమిచ్చి నష్టపడుట హాస్యాస్పదము. మూర్ఖుల యొద్ద ద్రవ్యముండుట కల్ల.

౨_౪– ౧౮

మనము దేశీయసంస్థాము వారమగుటచేత రాజకీయములందు పాల్గొనకూడదను మాయభిప్రాయముతో నేకీభవింతును. కాని మనకేరాజకీయములును లేవు. మన నిరంకుశ ప్రభుత్వముచే రాజకీయములు నిషేధింప బడినవి. కావున రాజకీయములే నిషేధింప బడగా వానివిషయమై యాలోచింప నవసరమేలేదు. ఈవిషయములో ప్రజలదేమి తప్పున్నదో తెలిసికొనగోరుచున్నాను. ఒక నిరంకుశ ప్రభుత్వము (బ్రిటిషు ప్రభుత్వము) అంతకును మించిన నిరంకుశ ప్రభుత్వమును తమ ప్రభువును నణగద్రొక్కుటలో పురికొల్పుచున్నది, ఒకవిధముగా ప్రజలదికూడ తప్పుకలదు. వారిలో ధైర్యములేదు. వారికి స్వాతంత్రేచ్ఛ లేదు. ఇట్టి కారణములో మనము వృద్ధినొందుటకై ప్రయత్నించము. హైందవులు ప్రకృతము యాత్మ రక్షణము చేసికొన జాలరు. కాని యేకారణముచే మనము విదేశీయులు మన ధనమును సంపత్తును దోచుకొని పోవుటలో మనమేల సాయపడ వలెను? నల్లవాని తలలో లేని తెలివి తెల్ల వానితలలో నెంత విశేషమున్నదో యేమో? ఈ యిద్దరికిని భేదమేమన తెల్లవానికి అన్ని అవకాశము లున్నవి. నల్లవానికి తాను ప్రయత్నించు వరకేమియు లేవు.

౨-౮-౨౮.

ఈ జనులతో పరిచయము విశేషముగు కొలదిని వీరి రాజ నీతి మోసకృత్యములు బాగుగా తెలియును, హిందూస్థానములో మన యజమానులగు వీరినిజూచి విమర్శించువారు వీరితత్త్వము నెరుగనివారు ఇంగ్లాండులో నేవిధముగు వేషములులేక యుండు వీరినిజూచిన వీరి నిజతత్త్వము బయల్పడును. ఇండియాలోని రాజ కీయములలో లాభములేదు.

౨౮-౯-౨౭.

సామ్రాజ్యవాదిచేగాని, నిరంకుశ జనునిచేగాని, పరిపాలింప బడుటకు కోరువారిలో నేనొకడను కాను.

* * * *

మనము విచిత్ర పురుషులము. ప్రతిహైందవుడును తనయభిప్రాయములను వెల్లడించ వలెను. కాని పిరికి తనముతో దాచుకొనగూడదు. మనలో కొందరికి వైస్రాయియగు నెవ్వరో మరియునతని కా పదవి యెందుకు వచ్చినదో తెలియదు. మనకు కొంత ధైర్యము లేకుండిన మనము వారిచేతి బొమ్మలగుదుము హిందూస్థానమందుండినట్లు ప్రపంచమందెందును నట్టిబాధ లనుభవించువారు లేరు. పూర్వకాలమందలి బానిసలకన్న మనము హీనస్థితిలో నున్నారము. ఇంగ్లండినను జనులు తమకు వాక్స్వాతంత్ర్యము లేదని మొర పెట్టుదురు. మనము వారిని జూచి యంతగా భయ పడుచుండ మన కది యెట్లు ప్రాప్తించును. ఇచ్చట యూరోపులో జనులు తమ మనస్సులోని భావముల నిర్భయముగా ప్రకటింతురు దీనికి కారణము ఏమన బ్రిటిషు ప్రభుత్వము మన యభివృద్ధిని కోరనందున బాల్యము నుండియు మనము తక్కువ వారమని యు బ్రిటిషు వారు హెచ్చు వారనియు భావించునట్లు చేయుచున్నది. వారి పత్రికల ద్వారా

యీపని చేయబడు చున్నది. ఇదికాక అనుకూల వాతావరణమును గలిగించుటకు మనలో శక్తిమంతులులేరు. ఈవిషయమున మనము బెంగాలును జూచినేర్చుకొన వలెను. హైదరాబాదు మూడు శతాబ్దములు వెనుక బడియున్నది. గడచిన నాలుగయిదు సంవత్సరము లనుండి బ్రిటిషు వారికి ప్రతికూలమగు నాందోళనము చేయు చున్నారు. కాని లెక్కల పట్టీలనుజూచిన వారి వ్యాపారము వృద్ధి యగుచున్నది. ఈ పరిస్థితులలో వారుకించిత్తుకూడ లెక్కబెట్టరు. మనమెన్ని విధముల నాందోళనముచేసినను వారికేమియు నష్టము కలుగుటలేదు. వారికిష్టము వచ్చినట్లు చేయుదురు. తమ రైల్వే డబ్బాలనుండి మనల తన్ని పంపుదురు. మనము ఇంగ్లీషువారి తన్నుకు సంతోషింతుము. ఇదిమన ఇండియా యవస్థ. ఇట్లున్నను మనకు ఇంగ్లీషువారు పరిపాలకులను కారణమాత్రముచేత ఎక్కుడధరలైనను వారి సరకులకొనుట గౌరవమని తలతుము. వారెట్లుగొప్ప వారైరి, ఏలనైరి, వారివలన లాభమేమి, ఇట్టివిషయములను మన మాలోచింపము.

౧౯-౭౫

హిందూస్థానములో నేడు యువకులలో నూటికి ౯౦ వంతు కష్టించు వారు, కానిఇంగ్లాండు వచ్చు యువకులలో నూటికి ౫ లేక ౧౦ మందికన్న నెక్కుడు నెందునకు పనికి వచ్చువారు లేరు. ఇంగ్లాండు కెందరు యువకులు పోదురో అందెందరు నిజమగు విద్యను సామర్థ్యమును సంపాదించుకొని తిరిగివత్తురో మీకు తెలియును. నెలకు ౭౫౦ లేక ౩౦౦ రూపాయీల యుద్యోగమువలన నేమియు లాభములేదు. ౧౦౦౦౦ సవరనులు ఖర్చు పెట్టిన తర్వాత నెలకు ౭౫౦ సంపాదించుట కష్టమైన పనికాదు. ఉద్యోగమునకై మనము చచ్చునంత యవస్థ పడుదుము. ఇంజనీయరింగులో ఇంగ్లీషు డిగ్రీ

కిని ఇచ్చటి (జర్మనీ) డిగ్రీకిని చాల భేదమున్నది. ఇంగ్లీషు గ్రాజుయేటు కన్న జర్మనీ డిగ్రీపొందినవాడు మేలైనవాడు. ఇంచుమించు అందరును నౌకరీతినే యుందురని నేను చెప్పను. వారి చదువును బట్టియుండును. నేను ఇంగ్లాండునకు పోయినందులకు వ్యసన పడుచున్నాను. ఇంగ్లాండుకు ఇంగ్లీషు భాష నేర్చుకొనుటకు గాని నౌకరీ సంపాదించుటకు గాని పోవచ్చును. కాని నిజమైన విజ్ఞానమునకది తగిన స్థలము కాదు. జగన్మోహను విద్యావిషయములో నాయభిప్రాయమడిగిన అతడు న్యాయశాస్త్రము నకై చదువకుండిన అతనిని నేనన్నటికిని నింగ్లాండునకు పోనియ్యను. కొంతకాలము తర్వాత ఇంగ్లీషుభాషా ప్రావీణ్యము పొందుటకై కోరినట్లయినపోవచ్చును. ఇండియాలో జనులకు చీనా సంగతి తెలియదు. చీనా వారు నల్లమందుతిని గాఢనిద్రలో లేరు. ఒక కాలమున ఇంగ్లీషువారు వారిని తుపాకీమొనలతో బెదరించి ఇండియాలో తయారైన నల్లమందుతినజేయుచుండిరి. ఇండియా పత్రికలు వారి విషయమై విచిత్రముగా వ్రాసి మనలనమ్మింతురు. చీనా వారందరు కమ్యూనిస్టులు అని కొందరందురు. మరికొందరు వారుయుద్ధము చేయలేనివారందురు. ఇదంతయు తప్పు ఇంగ్లాండువారు తప్ప. యూరోపులో తక్కిన వారందరికి చీనాలో నేమి జరుగుచున్నదో తెలియును. ఇంగ్లీషు వారోడి పోయిన సంగతి ఇండియాలో తప్ప ప్రపంచమందంతటను తెలిసినది. ఇండియా సిపాయీలు మన ద్రవ్యము ఖర్చుపెట్టి వారితో యుద్ధము చేయబోవుట విచారకరము. ప్రపంచ జాతుల దృష్టిలో మనము ఎంతటి శానిసలమో యెంత నీచులమో అను సంగతి మనము గ్రహించవలెను. యుద్ధము సంభవించినపుడెల్లను మన సిపాయీలు సంతోషముగా ఇంగ్లీషువారి పక్షమున యుద్ధముచేయుటకు సంసిద్ధులయ్యెదరు.

౧౧-౧-౨౬

ఇంగ్లీషు వారు చీనాలోని హాంకోనుండి (బహుశః కొంత కాలమువరకే యయినను) తరుమ బడినారని వినుటకు నాకు చాల సంతోషమైయున్నది. మనమేమియు చేయ జాల నట్టి దుస్థితిలో నున్నామని నాకు చింత కలుగు చున్నది. చీనావారు మనకన్న విద్యావంతులు కారు. యుక్తిలోను మనకన్న హెచ్చువారు కారు. కానిమనలో లేనట్టి యైకమత్యము వారిలో నున్నది. ఇంతే కాక వందల కొలది సంవత్సరముల నుండి మనము బానిసలముగా నుండుట చేత మనమనస్సు లో దాస్యభావములు నాటుకొని పోయి నందున మనము ఇంగ్లీషు వారిని దేవుని కొడుకుల వలె చూచు చున్నాము.

తారఖులేదు

రాజకీయములలో జోక్యముకలిగించు కొనవలదని తాము నాకు వ్రాసినారు. నేనట్లుచేయుచున్నానని తమకెవ్వరు చెప్పిరి? రెండవది ప్రతివారు రాజకీయములలో శ్రద్ధవహించు దేశములో దానినుండి దూరముగ నుండుట కానిపని. దాని విషయమై వ్రాయ దగినదేమియు లేనందున విశేషముగా నేను వ్రాయునవసరమును లేదు.

తారీఖులేదు

మనము గౌరవము కలవారమేని యుక్తిపరులమేని ఇండియా లో మనము ఇంగ్లీషువారిని నానా విధముల తొందర పెట్టవచ్చును. అమెరికాలో నీగ్రోల (సిద్దీల) స్థితి యెట్లున్నదో ఇండియాలో మన స్థితియు నట్లే యున్నది. దీనివిషయమై మాయసమ్మతిని తెలుపు

నోటీసును మేము పంపనున్నాము. దాని ప్రతి మీకు పంపుదును. ఇట్టిచెడ్డ పరిస్థితులలోను నీ దేశమునకు (ఇంగ్లాండు) మనజనులు పోవుటకు సంసిద్ధులగు చున్నారు. నాకిది చాల వికారముగా కన బడు చున్నది. "టైమ్సు ఆఫ్ ఇండియా" అను పత్రిక మన దేశములో ప్రకటితమై ఇండియా స్థితిగతులను చాల హీనముగా ప్రదర్శించుచు ఇండియాలో ౩౨ కోట్ల జనులున్నారో లేదో యను నట్లు చేయుచున్నది. అందెప్పుడైన పటములు వచ్చిన వికారవు అడవిజాతి స్త్రీనైనను లేక రాజకీయవేత్త నొకని వెక్కిరింతరల రూపమున నైనను లేక మహారాజా పటియాల వంటి మహారాజు పటమునో ఆగాఖాను పటమునో ప్రకటించును. ప్రతిదానికిని హద్దు కలదు. ఈ తడవవచ్చిన పత్రిక హద్దు మీరినది. ఎప్పుడును హిందూస్థాన జనులను ఇండియాను వికారముగా ప్రదర్శించునట్టి పత్రికలునాకు సరిపడవు. పత్రిక కొంచమే వ్రాయును కాని వెక్కిరించుటలో మితిమీరును. అట్టి పత్రిక నంతదూరమునుండి తెప్పించుకొనుట దుర్వ్యయమేకాక గౌరవభంగకరము. తాము కూడ ఏ ఇంగ్లీషు పత్రికను కొనకూడదని ప్రార్థించుచున్నాను. అట్టిదుర్జాతి పత్రికకు సాయముచేయవద్దని పినతండ్రిగారికి కూడ వ్రాయుదును.

౧౪-౫-౨౬

యూరోపులో చదువు విద్యార్థుల పరిస్థితుల వృద్ధిపరచవలయునని ప్రచారము చేయవలసియుండును. అట్లు చేయకుండిన ప్రజలు మమ్ముల విచారింపరు.

౨౩-౩-౯౬.

ప్రతి యువకునికిని, యువతికిని రాజకీయములు ముఖ్యావసరములని మీరు తలచినందులకు నాకు సంతోషమగు చున్నది.

బహుకాలమునుండి నాదియు నదే యభిప్రాయము. రాజకీయముల నింతనే యెవడును విప్లవకారుల సంఘమందు జేరవ సినపనిలేదు. మరియు నేదైన గొప్పపని చేయబనిలేదు. ప్రతివాడును నేమి జరుగుచున్నదో దాని నెరుగుటయనియు ప్రతివిషయము విచారించుకొను చుండవలయుననియు దాని యర్థము. నేటి హైందవ రాజకీయముల విషయమున నొక సంఘము రాజకీయ వృత్తినే యవలంబించుటచేనది దుస్థితియందున్నది. అందుకుమారుగా ప్రతి వాడును రాజకీయములందు శ్రద్ధ వహించిన ననేక స్వార్థపరులగు రాజకీయ క్షేత్రులకుమారుగా దేశమందు సద్బుద్ధికలిగిన రాజకీయ వేత్తలు బహుళమగుదురు.

౩౦-౧౧-౨౯.

ఇండియాలో రాజకీయ పార్టీలు పెక్కులున్నవని నిరాశచెంద వలసినపనిలేదు. జర్మనీలో నీప్రకారమే ౮౩ పార్టీలు కలవు. విదేశతంత్రములలో మనకందఱకును నొకేజాతీయ దృక్పథముండిన మనక్షేమియు నష్టముండదు. వృద్ధులకన్న యువకులే యీ సమస్యను పరిష్కరింప సమర్థులని నాయభిప్రాయము.

౧౬-౫-౨౬.

హిందూస్థానములో నంతయు మనకు ప్రతికూలముగా నున్నది. దేవుడుదైవముకూడ నిష్పక్షపాతముగను సానుభూతి కలవారుగనునుండుటకు మారుగ క్రౌర్యము వహించినట్లు కనబడుచున్నది. పూర్వము మనము చేసిన దుర్మార్గముల ఫలితముగా బహుళః మనదేశమట్టి కష్టముల ననుభవింప నర్హమైనదేమో. మనము ముందు గమనింపవలసినది, ముఖ్యముగా కార్మికులసమస్యయై యున్నది. ఎందరు గాంధీలైనను సరియే మనదేశము

యంత్రాలయముల ద్వారా పరిశ్రమల యభివృద్ధి నొందుటను నిరోధింపజాలరు. పరిశ్రమలు వృద్ధిపొందిన తర్వాత జనుల కు వ్యవసాయమొక్కటే జీవనాధారముగానుండదు. ఈకారణముచేత నే నొక వ్యవసాయ సంఘము ఏర్పడినది. దీని మూలమున జనుల యార్థికస్థితి వృద్ధియగును. దిగుమతులు విశేషమగును. స్వదేశీపరిశ్రమ లడుగంటును. ఇవి దీని ఫలితములు. ఇక్కడనుండు హైందవుల భావములు హాస్యాస్పదముగా నున్నవి. ప్రపంచములో నేమి జరుగుచున్నదో వారెరుగరు. కుక్క షికారీ జంతువు వాసనబట్టినట్లు వీరు క్రికెటుపందెముల వెంటబడి యున్నారు. మనవారు ఇంగ్లీషువారిని జూచి వారెట్లు చేసిన నట్లుచేయబోవుట చూచుట కసహ్యముగా నున్నది.

ఈ నాలుగు సంవత్సరములనుండి నాకు కలిగిన యనుభవముల కారణమున నేను పక్కాజాతీయవాదినైతినని చెప్పవలసినదే. ఇక ముందుకుకూడ నా యభిప్రాయములలో నేమిమార్పులైననుసరియే "ఇండియా ఇండియనుల కుండవలసిన" దను తత్త్వము మాత్రము నేను మార్చుకొననని దృఢముగా జెప్పగలను. యూరోపువారి యాధిపత్యమును నశింపజేయ వలయునను నిచ్ఛ నాదృష్టిమున ప్రధానస్థానము వహించియుండును. భావికాలమందు వృద్ధికి రాదగిన యిండియావంటి గొప్పదేశము మతమునకే రాజకీయములందు ప్రధాన స్థానమిచ్చి ఈ కష్టస్థితిలో నుండుటను తలచుకొనినప్పుడంతయు నాకు చాలవిచారము కలుగుచుండును.

*　　*　　*　　*

సీ. ఆర్. దాసు. లజపతిరాయి మోతీలాల్ నెహ్రూవంటి నాయకులు తమతప్పులెన్ని యుండినను హిందూ దేశము స్వాతంత్ర

దేశమై యుండిన దానిచరిత్రను క్రొత్తమార్గముల ద్రిప్పియుందురని నేను నమ్మెదను. ఇండియాలో హడ్తాలులు పూర్తిగా విజయవంతములు కాకున్నను ఇంతమాత్ర మొప్పుకొనవలెను. మనము దాని నలమైనను కొన్నియేండ్లక్రిందట మోసపోయినట్లు ఇప్పుడు మోసపోజాలము. ఏదైనను అచ్చటి పత్రికలధైర్యము మెచ్చుకొనదగినది ఫలితమెట్టిదైనను ముఖ్యముగా "ఫార్వర్డు" పత్రికలధైర్యము గమనింపదగినదే.

ఇదివరలో జనులపై బ్రిటిషుపత్రికా ప్రచార ఫలితమెట్లున్నదో ఇండియా పత్రికల ప్రచారముల వలన యువకులపై నట్టి ఫలితమే యుండునని నానమ్మకము. ఇది శుభసూచనయే. ప్రభుత్వమువారు తమ పక్షమునకు మునల్మానులను, నిమ్నజాతులను నాకర్షించి కొనినను నాకేమియు చింతలేదు. లజపతి రాయిగారు విమర్శించిన రీతిగా ౧౯౨౦ వ సం॥ లో నిమ్న జాతులు ౩ కోట్లుండ ౧౯౨౫ లో ౫ కోట్లు ౨౦ లక్షలును, ఇప్పుడు ౬ కోట్లును అయియున్నారు. ఇంతవరకు ప్రభుత్వము వారు వీరి విషయమై యేల శ్రద్ధవహించక పోయిరో నాకర్థ మగుటలేదు. ఎన్ని భేదములుండినను దృఢ సంకల్పముతో నుండు నల్పసంఖ్యాకులే హిందూమునల్మానుల మిథ్యాసంఘటనమున కన్న మేలుగా పరిస్థితులను వశపఱచుకొన గలరని నాయభిప్రాయము. ఓపికపట్టి ఫలితముల పరీక్షింతుము గాక!

"మొరుగు కుక్కలు కరవవు" అను సామెతలో నాకు విశ్వాసములేదు. అరచి యరచి తుదకు ఆకుక్కలే కరువ గలవని నాకు నమ్మకము. ఇండియనులు రంతులుపెట్టిన ఇంగ్లీషు [illegible]కి నష్టము. విశేషనష్టమిప్పుడు కలుగకపోవచ్చునుకాని ఇప్పుడిప్పుడే మనము రంతులు పెట్ట నారంభించినారము. ఈరంతులే కొన్ని యేండ్ల

లోపల నేభమోత్పాతమగు నట్లుగా పరిణమించునని నేను గట్టిగా చెప్పగలను. ఈ పదేండ్లనుండియే మనము పాశ్చాత్యులవలె రాజకీయాందోళనముల ప్రారంభించి యున్నారము. ఇట్లే మనమభివృద్ధి నొందుచుండిన ఇంక పదేండ్లలోపల అన్నియు మేలుగా నుండును. ఇంగ్లీషువా రడ్డుపెట్టకుండ మనలనిట్లు వృద్ధిపొంద నిత్తురాయని నాకుసందేహము కలుగు చున్నది.

మనము మాటలతో కాలముపుచ్చిన లాభములేదు. మనము జనులను తయారుచేసి యేదోయొకపనిని చేసినకాని లాభము లేదు. అయితే యీపరివర్తన కాలములో డప్పులుకొట్టి తీవ్రముగా మాట్లాడుట వలన గూడ చాల లాభముండును. నేను చెప్పునట్టి యీవాక్యముల కొక యుదాహరణ మిచ్చిన మీరు దీని స్వారస్యమును గ్రహింపగలరు.

డ్రెహోడూ పరిశోధక విద్యాసంస్థలో చదువువా రొకరు బ్రిటిషుప్రభుత్వము వారిచే యూరోపు ఖండమందలి కాగిదముల పరిశ్రమల నన్నింటిని చూచినేర్చుకొని వచ్చుటకై పంపబడి నారు. అతనిని నేనుకలసి నప్పుడు హిందూస్థానములోని రాజకీయ పరిస్థితులను గురించి విచారించితిని. రాజకీయ నాయకు లందరును మాటలతో కాలము పుచ్చుటయే కాని కార్య మేమియు లేదని పలికెను. తర్వాత నతడు ఇండియనుల హక్కులను పోగొట్టి ఇంగ్లీషువారికి హక్కుల కల్పించుచున్నారనియు ఇండియనులకు ప్రోత్సాహము లేదనియు చెప్పెను. అట్లయిన ఇంగ్లీషు వానినొకని పంపుటకు మారుగా ఇండియనునైన నిన్ను కాగితముల పరిశ్రమలనేర్చుకొనుట కెట్లుపంపిరని నేను అతనిని విచారించితిని. అతడు

ఇట్లు ఒప్పుకొన వలసి వచ్చెను. "ఇండియా శాసన సభవారు కేంద్ర ప్రభుత్వమును తొందర పెట్టుటచే నాకీ యవకాశము దొరికినది"



## వివాహమును గురించిన భావములు

౨౬-౩-౧౬

మన దేశ బాలికలకు వంట చేయుటయు ముచ్చటలాడుచు కూర్చుండుటయు, ఒకరితో నొకరు కలహించుటయే ముఖ్యమైన పని. దీనికి కారణమేమన వంటయిల్లే వారికి సర్వ ప్రపంచము. ఇరుగుపొరుగులోని యొకటి రెండిండ్లకన్న నెక్కుడుగా వారికి తెలియవు. మనము కులాచారమును, మతాచారమును, పనికిరాని యితర విషయములను పట్టుకొని ప్రాకులాడుదుము కాని యభివృద్ధి పొందుటకై ప్రయత్నించువారము కాము. ఇండియా పత్రికలందు యూరోపు దేశ బాలికలు ఏమియు పనిలేక తిరుగుచుందురను వ్రాతలు కొన్ని సమయములలో చదువుచుందును. ఇది పూర్తిగా పొరపాటుపడిన విషయము. ఇచ్చట వారు పురుషుల వలె చాల కష్టించి పనిచేయుచుందురు. ఈ స్త్రీలవలె మన పురుషులు కష్టించిన ఇండియా తన లజ్జాకరమగు స్థితినుండియు, దాస్యమునుండియు విముక్తి పొందగలదు. మన జనులు బాలికను యుక్త వయస్సు కలదైన వెంటనె యింటినుండి పంపివేయుట కలవాటు పడినవారని నాకు తోచుచున్నది. ఆమె పెనిమిటి బాల్యదశలో చనిపోయిన నామెకు పునర్వివాహము చేయనొల్లరు. ఆ బాలిక తన యావజ్జీవితమును తాను పెండ్లి కాని దానివలెనే గడపును. ఇట్టి

బాలికలు వేనవేలుగా నున్నారు. ఇట్టి బాలవితంతువులను గూర్చి మన కేమియు శ్రద్ధ లేదు. కొందరు అరబ్బులతోను కిట్చ్నర్ దీవముల తోను గొప్ప యోరేగింపు టుత్సవము చేసి, కొంత స్త్రీ ధనమిచ్చి పెండ్లిచేసి ఆమెను యింటినుండి వేరొకరి యింటికి పంపుటయె మన దేశీయుల కోరిక. మంచి భోజనము లేర్పాటు చేయుదురు. మరియు కలహములు మున్నగునవి జరుగును. ఈ ప్రకారముగా మన సొంత పెండ్లి జరుపునట్టే మనము మన కుమారుల యొక్కయు కూతుల యొక్కయు వివాహములు జరుపుదుము. ఇట్టివి తాము చేయుదురని నే నను.

౨౨-౨-౨౮

... ..నా యభిప్రాయమున బాలికలకు మన దేశములో నిప్పుడు జరుగుచున్నంత చిన్నతనములో వివాహము చేయగూడదు. అధమము ౨౦ సంవత్సరములు వచ్చువరకైనను వేచియుండవలయును. పాశ్చాత్య దేశములను దర్శించు నవకాశములును, అనుకూలములును గల బాలికల వివాహములు అట్టి దేశాటనము పూర్తియైన తరవాతనే చేయుట నమంజసము. ఏలయన, వ్యక్తులకు పాశ్చాత్య దేశములను చూచినతరువాత, నూతన భావము లుదయించును. క్రొత్తవాంఛలు, ఉదాత్తములగు నాదర్శములు ఉద్భవించును. కనుక వివాహమునకు పూర్వము బాలికల కట్టి నవ్యభావోదయ అవకాశము లుంచుట మంచిది. మరియొక విషయమేమనగా, బుద్ధివికాసము, విద్యగల బాలికలను వారి వివాహ విషయమున ఆలోచించుటయు, వారు బడయబోవు భర్తను గురించి వారి యంగీకారమును పొందుటయు మంచిపద్ధతి. బాలికల ఇష్టమును గమనించకయే వారినొక పురుషునకు కట్టిపెట్టు నధికారము ఏతండ్రికిని ఉండదు. నేను యూరోపు పోయిన తరువాత ఇట్టి

భావములు కలవాడనైతినని మీరందురు. కాని యథార్థముగనే మనలోని వివాహపద్ధతులపైన నాకు అనుకూలాభిప్రాయము లేదు. పైన చెప్పిన పద్ధతికిభిన్నముగా వివాహము చేయుట బాలికల విషయమున దౌర్జన్యము చేయుటయేయని నాభావము. మనకెట్టి యుదారములును, న్యాయములును నగు భావములున్నను, మనవారల కోరికలకు అభిప్రాయములకు మనము లోబడుట మానవ స్వభావముగా కనబడుచున్నది. ఇట్టి సందర్భములలో గృహమేధికి విషమావస్థ సంభవించును

వరుడగువాడు పరీక్షలలో కృతార్థుడై యుండవలయునను ఏర్పాటు అనవసరము. మానవుని శక్తిని పరీక్షించుటకు విద్యాపరీక్ష లెందునకును పనికిరానివి. కనుక యథార్థమగు శక్తిసామర్థ్యములు వివాహమునకు ముందే కలిగియుండుటను పరీక్షించుట గృహమేధియగు వాని విధి. అట్టిపరీక్ష చేసికొనినచో, తిరువాత విచారముగాని, నిరాశగాని కలుగదు. నాదృష్టికి వివాహ విషయమున వరునియందుండవలసిన యోగ్యత కష్టపడు స్వభావము కలిగియుండుటయే కాని ధనికుడై యుండుట కాదు. ధనవంతుడగు వరునికన్న స్వయంసహాయ స్వభావము కలవాడు ఎక్కువ చతురుడుగా నుండగలడు.

౧౦-౧-౨౭

---

విద్యావంతులమైన మనము వివాహములందగు ఖర్చులలో నూటికి ౨౫ ప్రకారము బోర్డింగున కియ్యవలెనని కొత్వాలుసాబుగారికి వ్రాసియున్నాను. ఇట్లుచేసిన విద్యార్థి వేతన మొకటి యియ్యవచ్చును. బ్రాహ్మణులకు, నూర్లకొలది యితరులకు, భోజనముపెట్టుటలో చాల దుర్వ్యయ మగుచుండును. ఇందుకు మారుగా నేదైన యుపయోగకరమగు కార్యము చేయువలయును.

౧౦-౩-౨౮

ఇప్పుడు కుముదినికి రామదేవరావుతో వివాహమైనందున ఆమె యభివృద్ధిని మనము విచారించుకొనవలెను. మరియు రామదేవరావును గౌరవింపవలెను. ఏలన అతని సుఖముతోను అభివృద్ధితోను నామె సుఖాభివృద్ధులు కలసియున్నవి. వారు హైదరాబాదులో నేమిచేయుచున్నారో నాకు తెలుపగలరు. అతడు హైద్రాబాదును విడిచి యితరదేశములకు పోయి వాని విశేషము లెరుగవలెను. అతడు హైద్రాబాదులోనే కూర్చుని ప్రస్తుత పైత్రుకమగు పోటి వ్యాజ్యముతో ప్రొద్దుపుచ్చుచుండకూడదు. అతనిని విదేశములకు పంపుట కేర్పాటు చేయవలెను.

౧-౪-౨౮

తాము (రెడ్డి) బోర్డింగునకు ౪౦౦౦౦ రూ. వాగ్దత్తము చేసినారని వినుటకు నాకు అత్యంతమైన సంతోషమైయున్నది. ఇంకొక ౪౦ వేలు లేక ౨౦ వేల మొత్తమును తాము వసూలు చేయుదుమని వారు మాటయిచ్చినచో ఈ మొత్తము నిచ్చివేయుట మంచిదని నాకు తోచుచున్నది. అంతటి మొత్తము వారికి లభ్యముగాకున్నను బాధకములేదు. మీ ౪౦ వేల రూపాయీలు గవర్నమెంటు సెక్యూరిటీలలో నుంచిన దానిపై నెలకు ౨౦౦ రు. వడ్డీవచ్చును. విశేషముగా రెడ్డిజాతి వ్యవసాయముతో సంబంధించినదని మీకు తెలియును. కావున బాగుగా చదివినట్టి యొక రెడ్డి విద్యార్థికి నెలకు ౧౦౦ రు ల విద్యార్థివేతన మిచ్చి రెండు సంవత్సరములవరకు ఏదైన నొక ఇండియాదేశపు వ్యవసాయ పాఠశాలలో చదువుటకు పంపవలెను. ఈ విద్యార్థివేతనము రెండు సంవత్సరములకొరకుండును. మరియు యీ విద్యార్థి తానును సంపాదింపగలిగి

-౨౬.

నప్పుడు తనకిచ్చిన మొత్తమును తిరిగి యిచ్చునట్లు ఒప్పుదల వ్రాసి యియ్యవలెను.

---

# దాస్యవృత్తి: పర్దా

---

నేను వ్రాసిన విషయముల నింకొక దృష్టితో పరిశీలించిన మీవిమర్శనము కొంతవరకు సరియైనదిగా నుండును. ఇంతవరకును దాస్యవృత్తి యేరూపమున నుండినను చెడ్డదనియు, నివారింపదగిన దనియు నాయభిప్రాయము. నావాదము వీరిస్థితినిబట్టి వ్రాయబడినది కాదు. నేనుచూపించిన నిదర్శనములు సహితము సాధారణమైనవి. ఈ బానిసల గురించి నామహమ్మదీయ సోదరులింకను హీనమగు పరిస్థితులను వర్ణింతురు.

పర్దా నొక్కదినముననే నిర్మూలింప వలెనని నేను వ్రాయలేదు. తద్విరుద్ధముగా నీపర్దా ఉత్తరము నుండియో దక్షిణము నుండియో మనకు వచ్చినదని నేనుజెప్పలేను. ఎట్లున్నను నేను నా వాదమును సమర్థించుకొన సంసిద్ధుడనుగ నున్నాను.

౨౦-౪-౨౬

---

నానాజాతి సమితికి సంబంధించిన మొదటి విషయములో నేనుమీతో నేకీభవింతును. దానిని పేర్కొనుటలో దాని నివేదికను ప్రమాణముగా తీసికొనుట నాయభిప్రాయము కాదు. నేను కేవలము దానినాధారము చేసికొని యీ విషయము వ్రాయదలచి యుంటిని. ఇండియాలో గాని, ప్రపంచ మందింకెచ్చటనుగాని బానిసతన మేరూపముతో నున్నను అది చెడ్డదిగా

నుండకుండినను దానినే మనము పట్టుకొని ప్రాకులాడ వలెననుట సమంజసము కాదు.

మీకు స్వయముగా మన ఇడిపాపల పిల్లల పరితాపకర మగు పరిస్థితులు తెలిసియే యున్నవి. వారికి శరీరాచ్ఛాదమునకు బట్టలులేక మురికితో నిండి యుందురు. అట్టివారు కుటుంబ ములో తిరుగు చుండుటను జూడ నసహ్యాకరముగా నుండును. వారిని విచారించుకొను విషయములో మీరుమన యింటిలోని మర్యాదలనుబట్టియే విమర్శించు చున్నారు. కాని మన యింటిలో వారిని చాలప్రీతితో చూచుచున్నాము. సాధారణముగా మన దేశ ములో వారిస్థితిఎట్లున్నదో చూచినట్లయిన బాగుండును. నేను వ్రాసి నకథ నిజమైనది. అది ..... ఫలానిపిల్లను గురించి వ్రాసినది కాన నాకల్పన యేమియు నందులేదు.

౨౮—౮—౨౭

హైందవజీవనములో ఘోరమైనదే దనిన అది పర్దాయని చెప్పుదును. మనస్త్రీలను అదిచంపుచున్నది. ఈ దేశపు స్త్రీలను వారుతమ దేశమునకును తమకును జేయుసేవను జూచిన తర్వాత మనదేశీయులను జూచిన నాకు సిగ్గగుచున్నది. మరియు ప్రాచీన ములో ఇండియను లంత గొప్పవారుగా నెట్లుండిరో యని యాశ్చ ర్యము కలుగు చున్నది. అయినను క్రమేణ యీ దురాచారము మాయమగునని ఆశించుచున్నాను.

## వివిధ విషయములపై యభిప్రాయము

......వారు ఇప్పుడు బర్లినులో నున్నారు. వారు జర్మనుల దారి ద్ర్యమును గురించియు వారి కష్టస్థితిని గురించియు వ్రాయుచున్నారు

ఇంగ్లీషు వారు జర్మనులు భయంకరులును క్రూరులును అని మనల నమ్మింతురని వ్రాసినారు, జర్మనుజాతి ఇంగ్లీషువారికన్న దయగల వారు. నిర్మల హృదయులు.

౧౪-౩-౨౩

భవిష్యత్తును గురించి చింతించుటలో నేమియు లాభము లేదు. భవిష్యత్తు మన యాధీనములో లేనప్పుడు బాలుర భావి స్థితిని గురించి యేల చింతింప వలెనో యూహింప జాలను.

౧౩-౬-౨౩

అచ్చట యెండ కాల మెట్టిదో యెరిగిన వాడనగుటచే నచ్చట బాలురు కష్టించుచున్నారని వినుటకు నాకు భయముగానున్నది. ఈ కారణము చేతనే మనము మొద్దులమై యెందుకును పనికి రాని వారమగుదుము. అయినను నీవిషయములతో నాకేమిపని?

౮-౮-౨౩

మీ యుత్తరము నా యుత్సాహమును శమింప జేసినదని నేననుకొనను. తన స్థితి గతులను యథార్థముగా గ్రహించిన వాని యుత్సాహ మెన్నటికిని క్షీణించదు. నా విషయమున మాత్రమిది నిజము.

౧౯-౧౦-౨౩

మీరు చాల కష్టించుచున్నారని యనుకొనెదను. అట్లు చేయుట మీ యారోగ్యమునకు భంగకరము. పినతండ్రిగారు! ఈ ప్రపంచము ద్రవ్యమే ప్రధానము కాదని తలచినట్లయిన మన సౌఖ్యమును గురించికూడ యాలోచించుకొనవలెను. ఆరోగ్యము లేకున్న

ఆనందముండదు. ఇట్లు వ్రాయుట మీకు నచ్చకుండిన క్షమించ గలరు.

౨౬-౧౨-౨౩

నాకు స్ఫురించిన విషయమున నేను పొరపాటు పడియుండ వచ్చును. మనుజులెప్పుడును తమకు ప్రోద్బలముగా నెవ్వరైన తమ ప్రక్కన నుండి బుజ్జగించియో బలవంతపెట్టియో తమకు సహాయమును చేయుచుండ వలెనని కోరుచుందురు.

౨౦-౨-౨౪

బాక్సింగు చాల మంచి యాట. అది శాస్త్రీయ మైనదియునై యున్నది. ఈ యాటను నేర్చుకొనుటకు నేను వారమున కొకతూరి పోవుచున్నాను. నాకవకాశమెక్కువగా నుండినట్లయిన నేను ఎక్కువ మారులు పోయి యుందును. ఈ జిప్టు దేశపు మమ్మీల కథమీరు వినిన రాలేదా? ఇచ్చటనాకు ఈ జిప్టు స్నేహితులు చాలమంది యున్నారు. వారు గోరీని దాని లోని వస్తువులను కనిపెట్టిన సంగతిని నాతో చెప్పిరి. ఇప్పుడు... వారు దానిలో సగము భాగము కోరుచున్నారట. ఈ జిప్టువారు వారిని నేమైన తీసుకపోనిచ్చిన వారిదే తప్పగానుండును. అయితే వారేమి చేయగలరు. తెల్లజాతులన్నియు......అలెక్కి సాయ ముగా నున్నారు. తాము స్వలాభము కోరమనియు, సైన్సు అభివృద్ధి కొఱకే యీ పరిశోధనచేయుచున్నామనియు చెప్పుదురు. వీరి కపట నాట్యమును జూచిన నాకు నవ్వు వచ్చుచున్నది.

౫-౩-౨౪

నీవు విశేషముగా చింత చేయకూడదు. తప్పుట సాధార ణము. ఏ యుద్యమమైన విజయవంతము కావలయుననిన దానిని

ప్రారంభించువాడు జయమందుటకు. పూర్వము అనేక మారు లుపజయమును విషమాను భవములను పొందవలసి వచ్చును.

౧౧-౯-౨౮

డిసెంబరులో నేనుబర్లినుకు పోదలచినాను.అచ్చట సీమెన్సు షెల్ ఎలెక్ట్రికు కంపెనీలో చేరదలచినాను. వారు నన్ను ఇండియాకు తమ ఇంజనీరుగా పంపించ వచ్చును. కాన నేను వారి దగ్గఱనే పని నేర్చుకొందును. (ఇది అనుకొనిన నాలుగు సంవత్సరముల తర్వాత ఫలించెను —సంపాదకుడు) మీరు యీ కష్టము నుండి తప్పించుకొనుటకును, యీ వ్యవహారములో నంతయు పరిచయము కలిగించుకొనుటకు యూరోప్నకొకతూరి ప్రయాణము చేసినట్లయిన చాల యుత్తమముగా నుండును. ఆలస్యము చేసిన లాభము లేదు. మీరు దీని కేమిప్రతికూలముగా చెప్పదలతురో యది నాకు తెలిసినదే! (౧) చాల పనులున్నవి. (౨) వ్యవహారము చెడును. (౩) చాల వ్యయములు ఇవి మీ ప్రతికూలవాదములు. ఈ మూడును మీరు ఆరోగ్యముకన్న వ్యవహారమే ప్రధానమని తలచిరని నిరూపించును. తుదకు మనము సౌఖ్యపడ నేరకుండిన ధనము వలన మనకేమి లాభము.

* * * *

మన సేవకులను కొంతవరకు మనము చెడగొట్టుచున్నాము, వారిని మనము తీసివేయము అని వారికి బాగుగ తెలియును ఏలన మనము దయామయులమనియు, మనము తీసివేసిన మనకే సేవకులు దొరకుట కష్టమనియు, వారికెచ్చటనైన నౌకరీ దొరకుననియు, వారికి తెలియును. అయితే మనము మన సేవకులకు జీతము చాల కొద్దిగా నిత్తుమని చెప్పవలసినదే.

౧౦.౬.౨౫

రాజకీయములలో ప్రామాణిక బుద్ధి పసికిరాదని చెప్పవలసినదే.

* * * * * *

ఈ దినములలో మీరు అస్వస్థతగా నున్నారని వినుటకు చింతిల్లుచున్నాను. మీకు నిరుత్సాహ మున్నదని యర్థము. కొంత కాలమునకై మీరు యూరోపు వచ్చిన బాగుండును. క్రొత్త విషయములు క్రొత్త ప్రపంచము చూచిన తర్వాత మీకష్టము లన్నియు తీరును. ఇట్లు చేయుట లాభమని నా యభిప్రాయము. ద్రవ్యమును వినియోగించకుండిన దాని వలన నేమి లాభము.

మీ బాబువలన ఇండియా సాధారణముగా దరిద్ర దేశ మను నభిప్రాయము తప్పని తెలియుచున్నది. మన దేశమందు ప్రకృతి దత్తమగు సంపద విశేషముగ నున్నను మనము మన దేశమునకు వృద్ధిగలిగించు మార్గములు నరయక మనము బీదవారమని మొరపెట్టుచుందుము, దీనికి మనమే నిందార్హులము......(అతడు) బాగుగా కష్టించ వలెను. అంతేకాక ఆటలలో వ్యాయామము లందును బాగుగా పాల్గొనవలెను. దీనికి రెండు కారణములున్నవి.

మొదటిది నాస్వయానుభవముచే మనము అప్పుడప్పుడు వివిధ విషయములందు మనస్సును జొనుపకున్న మనకు సౌఖ్యముండదు. అటు చేసిన మెదడుపై భారముండదు. రెండవది ఏదైన విరామ కాలమందు వ్యాయామము లేకుండిన మనస్సు ఇతర మార్గము లందు ప్రసరించి నష్టము కలిగించును.

ఇట్లనుటచే నతడెల్లప్పుడును నాడుకొను చూడవలెనని నేను చెప్పను. నేను వృద్ధికి వచ్చినదంతయు నా ప్రత్యేక మేధాశక్తి వలన కాదు. నేను యేదొక విధముగ నా జిమ్మేదారని గ్రహించునట్లు చేయబడుటయె దీనికి కారణము. ఇంతవరకు నా విజయము లకు కారణమిది.

౧౧-౫-౨౬.

మన ప్రాచీన సాంప్రదాయము ప్రకారము మనము మన పెద్దలను గౌరవింప వలయునను విషయమును నేను ప్రశంసింతును. అయితే మనము మన పెద్దలకన్న తెలివితక్కువ వారమని భావింపదొడగిన మనము పేర్కొనదగిన కార్యముల నెట్లు చేయగలము. మనకు ఆత్మ విశ్వాసము లేకుండిన ప్రపంచములో వృద్ధికి రాజాలము. మనము స్వతంత్రముగ నాలోచించుట కలవాటు పడినవారము కాము. ఈ లేనిపోని మర్యాదలచేత చిన్నప్పటినుండియు మన ఇచ్ఛ నిరోధింపబడుచున్నది. దీని దుష్ఫలములు మనకును ప్రపంచమునకు బాగుగా విదితమే!

౧౫-౬-౨౬

ఉత్తరములు వ్రాసికొనుటచే జనులు పరస్పర సామీప్యమును గలవారై యుందురని తలతును. ఒకరి నొకరు కలసికొనినట్టి ఫలితమే దీనికిని కలదు. ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటను మానినట్లయిన పరస్పర సంబంధము నిలిచిపోవుటయే కాక యొకరి నొకరు మరచిపోవుటయు సంభవించును.

౨౨-౬-౨౬

బాలుర యావశ్యకము లెవ్వియో వారి సామర్థ్యము లెట్టివో వానిని తల్లిదండ్రులు గమనించి యా మార్గములలోనే వారిని నడపించుట వారి విధియని నా నిశ్చితాభిప్రాయము.

పూర్వ కాలములో మన విద్యా పద్ధతి శ్రేష్ఠముగా నుండెడి దేమో కాని కాలము మారినది.

ఇది ఇనుము, ఉక్కు యంత్రములు, ముడి పదార్థములు తయారైన సామానులకు మార్కెట్టులు, శృతిమించిన జనసంఖ్య కలిగిన కాలము. కావున పూర్వకాలపు పద్ధతులపైననే మనవిద్య జరుగనేరదు. అట్లు చేసినట్లయిన మనము నిరంతరదాసులముగానే యుండవలసి వచ్చును.

పాఠశాలలో మనకు పనికిరాని పాఠములు నేర్పుదురు. అవి మనకెట్లు లాభకరములో, మన జీవితమునకెట్లు అవియుపకరించునో యోచించక నేర్పుచుందురు. నూటికి ముగ్గురు నలుగురికన్న నెక్కుడు విద్యార్థులు తామెందుకు ఆల్జిబ్రా చదువుచున్నారో తెలియదు. విద్యార్థులలో స్వతంత్ర భావములులేవు. వారి యాలోచనలకును వారి చర్యలకును వారు స్వతంత్రులుకారు ఇదంతయు తప్పని పనియని వారనుకొనునట్లుచేయుదురు.

౨-౧౦-౨౬

మనము సక్రమముగా పరిశ్రమ చేయవలయుననిన మనముమన కార్యములను సరియగు మార్గములలో నడిపించుకొన వలసినదే!

౧౨-౧౦-౨౬

మనము వెనుకబడియుంటకు కారణములు మూడని మీరు చూపించియున్నారు. ముఖ్యముగా మన రాజకీయస్థితి పైననే మిగత రెండును అనగా విద్యాలోపము గ్రహణశక్తి క్షీణతయు నాధారపడియున్నవి. దేశము సరియైన మార్గమందున నడచి నట్లయిన మన రాజకీయముల హద్దువరకు అంతయు సరిగానున్నదనవచ్చును.

౭—౧౨—౧౬,

ఏపనినైన చేయనిశ్చయించిన వానికి కావలసినంత కాలము దొరకగలదు.

౨౦—౪—౨౭.

నాకు జ్ఞాపకమున్నంత వరకు మనదేశములో నీటికరవు, క్షామమున్నదని యెల్లప్పుడును వినుచుందును. ఎప్పుడును ఇండియాలో జనులు సంతోషముగా నుందురని వినుటలేదు. ఇదినిజమైన దిగ నుండవలెను. లేదా మన దృక్పథమే యిట్టిదని చెప్పవలెను.

ఇదియే నిజమైన దీనికి కారణమేమో నాకుదోచదు. నూటికి ౮౦ వంతు జనులకాధార భూతమైన వ్యవసాయము అన్నిటికన్న తక్కువ సహాయ కారిగా నున్నది. మన నాయకులు రాజకీయ సంస్కరణములను గురించి యాందోళనము చేయుటకు మారుగా నీవిషయము లలో బాగుగా చర్చింపకుండుట శోచనీయము.

౨౧—౧౧—౨౮.

బాలురను బాగుగా శిక్షింపకుండిన వారిని నితర బాలురతో కలసిమెలసి జీవించునట్లు చేయకుండిన, వారిని తమ శక్తిపైననే యాధార పడునట్లు చేయకుండిన, వారుతమ స్థితిగతులను విచారించు కొనుటకు నశక్తులై యుండగలరు.

* * * *

దూరమందుండు వస్తువులు సుందరముగా గనబడుట సహజము. ఇండియాలోని పరిస్థితులు ఇచ్చటివారికి చాలభేదముగా గనబడి యవి సాధారణమైననిగా గనబడు చుండును. కావున తమ జాబులు చూచిన నాకు యదార్థములు గోచరించు చుండును. దిన దినము నాయుత్సాహము క్షీణించుచున్నది. ఇండియాలో నాభావి జీవితము విషయములో నాకు అధైర్యము కలుగుచున్నది. అక్కడకువచ్చిన మిమ్ములందఱను జూచుటయు, అచ్చట యేదోయొక

యుపకారమగు కార్యములను జేయ కాంక్షించుటయు, నా దేశమునకు వచ్చుటకు ప్రోత్సాహము కలిగించును. విదేశములనుండి స్వదేశమునకువచ్చువారి భావములకును, నాభావములకును భేదముకలదు. కొన్ని సమయములలో నేను మూర్ఖుడనని తలచుకొందును. ఏలన నాకు దేనియందును తృప్తి కలుగనట్లున్నది. ఏదియు నాకానందము కలిగించనట్లున్నది. క్లిష్టసమస్యలను పరిష్కరించిన వాడనైనను నాకు తృప్తి చాలకున్నది. నేనింతవరకు ఉపక్రమించిన కార్యముల నన్నింటిలో విశేషముగా జయము పొందినాడను. నేను సుఖముగా జీవించుటకై నాకు కావలసినంత ద్రవ్యము పంపుచున్నారు. నాబంధువులందరు నాపై విశ్వాసము కలవారు. అయినను బాగుగా పర్యాలోచించుకొనగా నిజమైనయానందము నాకు లేదు.

అచ్చటిజనులు కష్టించుటకుగాని ప్రామాణికబుద్ధి కలవారుగా నుండుటకు గాని యిష్టపడరని నమ్ముచున్నాను. మనవారిలో ప్రాప్తితత్త్వమును, దరిద్ర దశయు, గుణలోపము — ఇవి యుండుటచే వారిలో ప్రామాణికబుద్ధి యెట్లుండును. ఇండియనులవలె నచ్చటి జనులును దరిద్రులుగా నుండినట్లయిన వీరును అప్రామాణికులుగా నుండి యుందురు.






G. P. Press. Hyd. 1000-31-1-193